THE ANDHRA PATRIKA .MADRAS.

6 పేజీలు వెల 1 అణా. హాలీ 0-1-2.

దేశీయ వైద్యానికి ఉజ్వల భవిష్యత్తు:
రాష్ట్రపతి ముఖ్యమంత్రి అభిభాషణ
—6 వ పేజీ

# ఆంధ్రపత్రిక

సిద్దేశ్వరం ప్రాజెక్టునే ముందుగా ప్రారంభిం
చాలి: బాగలమర్రి సభలో ప్రముఖుల ఉద్ఘాటన
—2 వ పేజీ

Regd. No. M. 1118 సంపుటం 39. సంచిక 327 FOUNDER : DESODHARAKA K. NAGESWARA RAO. సోమవారము 2-3-1953

# ఆంధ్రప్రదేశ కాంగ్రెసు నూతన కార్యవర్గసభ్యుల జాబితా

## నవ్వులల్లా నువ్వులు

### గోరఖ్‌పూరులో వసంతోత్సవ సంఘటన

గోరఖ్‌పూర్, ఫిబ్రవరి 23: వసంతోత్సవంకు పోతే నువ్వులయిందన్న సామెత ఈవేళ ఇక్కడ పూర్తిగా నిరూపించబడ్డది. హోలీ పండగ సందర్భంలో నవ్వులుగా వసంతాలు చల్లుకుంటున్న గుంపుకటి ఆనవ్వు లవల్ల మరొక వ్యక్తికి నువ్వులు, పీల్లు వదలవలసిన పరిస్థితిని తెచ్చి పెట్టింది.

ఒక రోగిని ఆస్పత్రికి తీసుకుని వెడుతుండగా, వసంతాల గుంపొకటి తటస్థపడ్డది. వాళ్లనవ్వులవల్ల ఘర్షణబయల్దేరి, హడావుడిలో రోగి గుటుక్కుమన్నాడు. కొందరిని ఆటీ కారులు అరెస్టుచేశారు.

కలకత్తాలో ఈవేళ ఈ నవ్వుల వరదాల్లో 50 మందికి గాయాలు తగిలినవనీ, 350 మంది అసభ్య ప్రవర్తనకు అరెస్టయినారనీ తెలుస్తున్నది.

## కాళేశ్వరరావు, పళ్లంరాజుగారలకు ఉపాధ్యక్షహోదా: సంజీవరెడ్డిప్రకటన

### సంయుక్తకార్యదర్శులుగా పుతుంబాక శ్రీరాములు, బెండి కూర్మన్నగార్ల నియామకం

['ఆంధ్రపత్రిక' విలేఖరి]

న్యూఢిల్లీ, మార్చి 1: ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు ఉపాధ్యక్షులుగా శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, పళ్లంరాజు గారలను నియమిస్తూ ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు నీలం సంజీవరెడ్డిగారు ఈవేళ రాష్ట్రకాంగ్రెస్‌సంఘ కార్యవర్గాన్ని ప్రకటించారు.

అల్లూరి సత్యనారాయణరాజుగారిని ప్రధానకార్యదర్శిగా లోగడనే నియమించారు. సహాయకార్యదర్శులుగా పుతుంబాక శ్రీరాములు, బెండి కూర్మన్నగారలు నియమించబడ్డారు.

నూతన కార్యవర్గంలోని మిగతా సభ్యులపేర్లు ఇవి: (1) శ్రీ ఉకలాపు లక్ష్మణదాసు (2) మిస్సుల సూర్యనారాయణ, (3) మొసలికంటి తిరుమలరావు (4) అల్లూరి బాపినీడు (5) మాగంటి అంకినీడు (6) కాకాని వెంకటరత్నం (7) నంబెన వెంకటరాజు (8) బెజవాడ గోపాలరెడ్డి (9) శ్రీమతి అమ్మన్నరాజా (10) శ్రీ చెంగల్వరాయ నాయుడు (11) కోటిరెడ్డి (12) నాయకంటి శంకరరెడ్డి (13) సందా నారాయణప్ప (14) టి. జి. తిమ్మయ్యచెట్టి, (15) వి. సి. కేశవరావు.

## ప్రకాశం, కృపలానీ సమాలోచన

న్యూఢిల్లీ, మార్చి 1: ఆంధ్ర ప్రజాసోషలిస్టు పార్టీ నాయకులు శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులుగారు నిన్న ఇక్కడికి వచ్చారు. నిన్న సాయంకాలం, ఈవేళ ఉదయం ప్రకాశంగారు ఆచార్య కృపలానీని కలుసుకొని మాట్లాడారు. స్వ. వి.

## గ్రీసు, టర్కీ, యుగోస్లావియా పరస్పర రక్షణ సంధి

### అంకారాలో త్రైపక్ష సంతకాలు

ఏథెన్సు, ఫిబ్రవరి 28: తమ స్వాతంత్ర్యమును రక్షించుకునే దృఢ సంకల్పమును వెల్లడించే సంధిని గ్రీస్, టర్కీ, యుగోస్లావియాలు నేడు చేసుకున్నవి. రక్షణకు సంబంధించే సమస్యల నన్నిటిని ముగ్గురుకలిసి విచారించే సంకల్పాన్ని నేడు అంకారాలో సంతకమైన ఈ సంధి వెల్లడిస్తున్నది.

పరస్పరము మిత్రభావమున మెలగడానికి, పరస్పరము సహకరించడానికి ఈ మూడు దేశాలూ చేసుకున్న సంధిలో ఉపోద్ఘాతమును, పది క్లాజులు వున్నాయి.

ఈ సంధిలోని భావం స్పష్టంగా లేకపోయినప్పటికి ఇది చాలా ప్రాధాన్యం వహించే సంధి అని, ఈ మూడు దేశాలను రాజకీయ, రాయబార సైనిక విషయాల్లో అత్యంత సన్నిహితం చేసే సంధి అనీ ఏథెన్సులో గ్రీక్, విదేశీయ పరిశీలకులు అంటున్నారు.

ఈ మూడు దేశాలూ ఈ వారంలో ద్విపాక్షి వాణిజ్య ఒప్పందాలు చేసుకున్నవి. ఇందువల్ల ఈ మూడు దేశాల ఆర్థిక సమస్యల పరిష్కారం సులభసాధ్యం అవుతుంది.

మూడు దేశాల సైనికాధికారులు కలిసి రక్షణ సమస్యలను పరిశీలించాలని ఒక సూత్రం చెప్పుతున్నది. ఈమూడు దేశాలకు కలిసి 60 డివిజన్లసేనవున్నది. సోవియట్ రష్యా బాల్కన్ ఉపగ్రహాలకూటమి సైన్యమునకు యిది సమంగా వుంటుంది.

## ఫార్మోజాకు కొత్త అమెరికన్ రాయబారి నియామకం

వాషింగ్టన్, ఫిబ్రవరి 28: ఫార్మోజాలో అమెరికన్ రాయబారిగా కారల్ రాంకిన్‌ను నియమించటానికి అమెరికన్ సెనేట్ నేడు అంగీకరించింది. స్పెయిన్‌లో జేమ్స్‌డన్‌ను రాయబారిగానూ, దక్షిణ అమెరికా వ్యవహారాలశాఖ కార్యదర్శి జాన్ కాబట్‌నూ నియమించటానికి కూడా సెనేట్ అంగీకరించింది.

## త్వరలో నేపాళ్లో అధ్యక్ష పాలన: తిరిగి ఎన్నికలు

### ఢిల్లీ వర్గాల విశ్వాసం

న్యూఢిల్లీ, మార్చి 1: రోజు రోజుకీ మారుతున్న నెపాళ రాజకీయ పరిస్థితులమీద ఢిల్లీ ప్రభుత్వం తీసుకునే చర్య ఏమిటో సంస్థాన శాఖోద్యోగులు మహాగోప్యంగా ఉంచాలని ప్రయత్నిస్తున్నారు కాని, రేపో, మాపో అక్కడ అధ్యక్ష పరిపాలన ఏర్పడటం, వెంటనే జనరల్ ఎన్నికలు జరగటం తప్పదని ఇక్కడ నమ్మకంగా తెలుస్తున్నది.

యునైటెడ్ ఫ్రంట్ ప్రభుత్వం సాగించగలదని ముఖ్యమంత్రి కరేవాలే ప్రకటించినప్పటికీ, శాసన సభ్యులు తరచూ పార్టీలు మార్చటం ఉచితంగా లేదనీ, తిరిగీ ఎన్నికలు జరిపితేగాని పరిస్థితులు చక్కబడవనీ ఢిల్లీ వర్గాలు భావిస్తున్నారు. (యు పి.ఐ)

### ముఖ్యమంత్రి రాజీనామా

నెపాళ ముఖ్యమంత్రి కరేవాలా నేటి ఉదయం తన పదవికి రాజీనామా ఇచ్చినట్లు ఢిల్లీలో అధికారరీత్యా తెలుస్తున్నది. ఈయన ఎన్నిక ఇటీవలే రద్దయింది.

## హైద్రాబాదు మంత్రివర్గం

### ముగ్గురి రాజీనామాకు రాజప్రముఖ్ ఆమోదం

హైదరాబాదు, మార్చి 1: మంత్రులు పల్లూరి బసవరాజు, ఫూల్చంద్ గాంధీ, జగన్నాథరావు, చందార్కిగార్ల రాజీనామాలను రాజప్రముఖ్ నిజాంగారు ఆమోదించినట్లు తెలుస్తున్నది. మిగిలిన 10 మందితో కొత్త మంత్రివర్గం నిర్మితమవుతుంది. ఇప్పటి పోర్టుఫోలియోలు మారుతాయి. పునర్నిర్మితమైన కొత్త మంత్రివర్గ ప్రకటనను ముఖ్యమంత్రి రామకృష్ణరావు గారు నేటి సాయంకాల పత్రికాప్రతినిధుల గోష్ఠిలో చేయనున్నారు.

ఈ కొత్త మంత్రివర్గంలో భాషలవారీ ప్రాతినిధ్యం ఈ విధంగా ఉంటుంది. ఆంధ్రులు 3 గ్గురు; మహారాష్ట్రులు 3 గ్గురు; కర్ణాటకులు 3 గ్గురు; ముస్లిం 1. (స్వ. వి.)

## జఫ్రుల్లాఖాన్ బర్తరఫ్‌కు ముస్లింల ప్రత్యక్ష చర్య

### లాహోరులో ఉద్రిక్తస్థితి

లాహోరు, ఫిబ్రవరి 28: అఖిల ముస్లింపార్టీల గోష్ఠి నిన్నటి దినం ప్రారంభించిన ప్రత్యక్ష చర్య సందర్భంగా 25 మందితో కూడిన వాలంటీర్ల దళ మొకటి తల మున్కలుగా దండలతో ప్రత్యేకమైన ఊరేగింపు వెళ్లుతుండగా, అసెంబ్లీ గుటకే పట్టణ ముఖ్యవీధులగుండా ప్రభుత్వ భవనంవద్దకు యాత్ర సాగించడంతో లాహోరులో నాలుగు గంటలకు పైగా ఉద్రిక్తస్థితి పొడసూపింది.

విదేశాంగమంత్రి జఫ్రుల్లాఖానును వెంటనే బర్తరఫు చేయవలెననీ, ఆయన పలుస్థలాల అహ్మదీయాలను మైనారిటీ వర్గంగా ప్రకటించవలెననీ ఈ అఖిలపక్ష గోష్ఠివారు కోరారు.

నియంతె మాల్వి సులాండీకా తో పాటు దళం దళమంతా అసెంబ్లీహాలు వద్ద అరెస్టయిపోయింది. పొవ్పవాయు ప్రయోగానికి సర్వసిద్ధంగా సకల పరికరాలూ సమకూర్చుకొని, ఆ యుద్ధయంత్రాలను సేకరించగా ... పోలీసులు అక్కడ కాపలాదారులు ...

పోలీసులు వాలంటీర్లను పట్టుకొనిపోగా, లక్ష ప్రాదాపు గాథ ... వద్ద ... సంపన్ముల్ ప్రతికూలనినాదాలూ, క్వాదియానీ ప్రతికూల కేకలూ వేస్తూ పెనుకక్కు వెళ్లిపోయారు.

ఈ వాలంటీర్లంతా పిల్లా లాహోరు నగరమందంతటా వ్యాపారం స్తంభించిపోయింది. రాకపోకలు మందగించాయి. బస్సులు ప్రయాణీకులతో కిటకిటలాడుతూ తొందరపెడుతూ సాగింపలసివచ్చింది. ముఖ్య స్థానాలవద్ద అంతటా పోలీసులు కాపలా కాచారు.

ఈ ఆందోళనలో ప్రముఖపాత్ర వహిస్తున్న 5 గురు ఉలేమాలను కూడా పోలీసులు ఇవాళ ఉదయం వారి వారి యిండ్లవద్ద పట్టుకొన్నారు.

రాష్ట్రంలోని మరికొన్ని పట్టణాలలో కూడా ఇలాంటి సంఘటనలు, అరెస్టులూ జరిగినట్లూ, 30 మంది వాలంటీర్లు ముల్తాన్‌లో అరెస్టయినట్లూ వార్తలు వచ్చాయి.

### పాకిస్థాన్ ఎమ్బెసీ ఆలస్యం

విద్యార్థి ప్రయాణీకులు చేసిన ఆందోళనమూలంగా పాకిస్థాన్ ఎక్స్‌ప్రెస్ ... ఆలస్యంగా వచ్చింది. ... నిన్నటిలాగానే ఈ రైలులో ప్రయాణము చేస్తున్న 850 మంది విద్యార్థులు ...

ముంత్రంమీద 60 సార్లుఆలారం గొలుసు లాగారు. స్త్రీ ప్రయాణీకులపట్లచాలా దురుసుగా ప్రవర్తించారు. రైలుపెట్టెలలోని పరికర సామగ్రిని నానాగల్లంతు చేసిపెట్టారు.

పంజాబు విశ్వవిద్యాలయం మెట్రిక్యులేషన్ పరీక్షలకు హాజరౌవలసిన కొందరు విద్యార్థినులతో వస్తున్న కారణంతో రైలుకు ప్రత్యేక పోలీసు ఏర్పాట్లు జరుగుతున్నాయి.

### అరెస్టయిన 11 మంది మౌలానాలు

కరాచీ, ఫిబ్రవరి 28: అహ్మదీయ వ్యతిరేకోద్యమ సందర్భంగా నిన్నటి దినం ఇక్కడ అరెస్టయిన ప్రముఖ మౌలానాలు 11 మందీ ఒకసంవత్సరంపాటు సెక్యూరిటీ చట్టంక్రింద పెట్టబడతారని పి. టి. ఐ. వారికి నమ్మకంగా తెలియవచ్చింది.

క్వాదియానీలకు ప్రతికూలంగా తామొక ప్రత్యక్షచర్య సాగించదలచుకొన్నట్లు యీ మౌలానాలు గతగురువారంరాత్రి జరిగిన ఒక బ్రహ్మాండమైన బహిరంగసభలో ప్రకటించారు. ఈ ఉద్యమానికి నియంతగా మౌలానా ... అనేఅతనిని వేసుకొన్నట్లుకూడ వారు ప్రకటించారు.

### 179 అరెస్టులు

ఈ ఉద్యమ సందర్భంలో నేడు 179 మంది అరెస్టయినట్లు పాకిస్థాన్ అధికారులు నేటిరాత్రి చెప్పారు. ఇది తప్ప అన్యథా నేడు ప్రశాంతంగానే గడిచిపోయినట్లు వారన్నారు.

## బెంగాలీ భాషాసమస్య

### ఢాకా విద్యార్థుల దర్శనాలు

ఢాకా, ఫిబ్రవరి 28. ఢాకా విద్యార్థులు దాదాపు 500 మంది పాకిస్థాన్ చారిత్రక సభ జరుగుతున్న మందిరములోనికి ప్రవేశించి సభా...

(2-వ పేజీ చూడుడు)

## మంత్రులు వి.బి. రాజు, ఫూల్చంద్ గాంధి, జె.చందార్కిగార్ల రాజీనామా

### నేడోరేపో హైద్రాబాదుమంత్రివర్గ పునర్నిర్మాణం

హైదరాబాదు, ఫిబ్రవరి 28: మంత్రులు వి. బసవరాజు, ఫూల్చంద్ గాంధీ, జగన్నాథరావు చందార్కిగార్లు నేటిదినం పార్టీనాయకుడు రామకృష్ణ రావుగారికి తమ రాజీనామా లేఖలు పంపినట్లు తెలిసింది.

కాగా, ముఖ్యమంత్రి యిప్పుడు ఈ క్రింది పదిమందితో తమ నూతన మంత్రివర్గాన్ని ఇప్పుడో అప్పుడో ప్రకటించేటట్లు కనబడుతున్నది.

శ్రీయుతులు బూర్గుల రామకృష్ణరావు, దిగంబరరావుబిందూ, డాక్టరు జి. యస్. మేల్కోటే, వినాయకరావు విద్యాలంకారు, వెంకటరంగా రెడ్డి, డాక్టర్ యం. చెన్నారెడ్డి, దేవసింగు చౌహాన్, అన్నారావు, నవాబ్ మెహిదీనవాజ్ జంగ్ బహదూర్, శంకరరావుదేవుగార్లు.

మంత్రివర్గ పునర్నిర్మాణంలో కాంగ్రెసు లెజిస్లేచరుపార్టీ నాయకునికి కాంగ్రెసు అధ్యక్షుడు నెహ్రూ సంపూర్ణస్వేచ్ఛ ఇచ్చినట్లూ, అయితే అలా చేయడంలో ముందున్న క్లిష్ట కాలాన్ని ఎదుర్కోగలిగిన సుస్థిర ప్రభుత్వం ఏర్పడేట్లుగా చూచుకోమ్మని మాత్రం సూచించినట్లూ అభిజ్ఞవర్గాలవల్ల తెలియవచ్చింది. ఏర్పడబోయే కొత్త మంత్రివర్గం పార్టీ బలాన్ని ఎక్కువగా పొందగలిగేటట్లు చూచుకొమ్మనికూడ కాంగ్రెసు అధిష్టాన వర్గంవారు తెలియజేసినట్లు అనుకొంటున్నారు.

ఇప్పుడు కాంగ్రెసుకు శాసన సభలో చాలా తక్కువ మెజారిటీయే ఉంది. రాయచూరు ఉపఎన్నికలో కాంగ్రెసు అభ్యర్థి ఎక్కువవోట్ల తేడాతో ఓడిపోవడం, అందులోనూ జనరల్ ఎన్నికల్లో గెలిచిన ఇదేఅభ్యర్థి ఇప్పుడు పీపిల్సు డెమోక్రటిక్ ఫ్రంటు అభ్యర్థి చేతుల్లో ఓడిపోవడం కాంగ్రెసుకు చాలా కలత కలిగిస్తున్నది.

శాసనసభలో ఇప్పటి పార్టీ బలాబలాలివి:—

కాంగ్రెసు 90; పీపిల్సు డెమోక్రటిక్ ఫ్రంటు, సోషలిస్టు, ప్రజంట్స్ అండ్ వర్కర్స్, స్వతంత్రులు కలిసి 78; నియమ్మకాతిసభ్యులు 5. శాసనసభ సభ్యుల మొత్తంసంఖ్య 175. మిగిలిన రెండు స్థానాలు (అలంపురం-గద్వాల్) ఖాళీగా ఉన్నాయి. వాటికి ఏప్రిల్ 6 వ తేదీనాడు ఉపఎన్నిక జరుగనున్నది. (స్వ. వి.)

## కలకత్తా మేయరు మృతి

కలకత్తా, మార్చి 1: కలకత్తా మేయరు ఎన్. సి. చందర్ (వయస్సు 64) ఇటీవల కొంతకాలంనుంచి అస్వస్థులై వుండి నేటి మధ్యాహ్నం మరణించారు.

## ఆంగ్లభాషను అభ్యసించినా మాతృభాషను మరవకూడదు

### విద్యామంత్రి ఎం. వి. కృష్ణరావుగారి ఉద్బోధ

మదరాసు, ఫిబ్రవరి 28: "అంతర్జాతీయ ఉపయోగంకోసం ఇంగ్లీషును చదువుకున్నా మాతృభాషను మరువకూడదు" అని విద్యామంత్రి డా॥ యం. వి. కృష్ణారావుగారు నిన్న సాయంత్రం ట్రిప్లికేన్‌లోని హిందూ హైస్కూలు వార్షికోత్సవమునకు అధ్యక్షత వహించి చెప్పారు.

హెడ్మాష్టరు శ్రీ టి. పి. శ్రీనివాస వరదన్ మంత్రిగారికి స్వాగతమిచ్చి స్కూలు నివేదికను సమర్పించారు.

చదువులో ప్రావీణ్యం చూపిన వారికి బహుమతులు పంచిపెట్టిన పిదప విద్యామంత్రి ప్రసంగిస్తూ సాంప్రదాయాలను నిలబెట్టుతున్నందుకు హిందూ హైస్కూలును అభినందించారు. అనేక మహామహులు ఈ స్కూలులో చదువుకున్నవారు వున్నారు. ఈ స్కూలు సాంప్రదాయాలవల్ల ఇక్కడ చదువుకున్నవారికి కొన్ని బాధ్యతలు ఏర్పడి ఆ సాంప్రదాయాలను నిలబెట్ట వలసివచ్చింది. రాష్ట్రంలో బాగా నిర్వహింపబడుతున్న స్కూలు ఇది ఒక్కటేననిచెప్పగలను. చాల మంది జీతాలు మినహాయించబడుతున్నందుకు చాల సంతోషం. ప్రాథమిక సెకండరీ విద్యా సౌకర్యాలను విస్తృతము చేయుటకు వీలుగ ఆర్థికస్థితి సమకూరగలదని ఆశిస్తున్నాను. ఉపాధ్యాయులకు కూడ సంఘం వున్నదని తెలుసుకొనుటకు సంతోషముగ వుంది. స్కూల్లో ప్రారంభంనుండి తెలుగు, తమిళ ములలో బోధన జరుగుట చాలబాగుంది. బొంబాయిలోని దక్షిణాదివారి స్కూళ్ళు దక్షిణాదిభాష లన్నిటిలో బోధిస్తున్నాయి. గత ఆరేళ్లలో రాష్ట్రంలో సెకండరీ స్కూళ్లసంఖ్య పెరిగింది. సహాయం చేయాలని ఎంతో వున్నా ధనములేక చేయలేక పోతున్నాం అని మంత్రిగారు చెప్పారు. శ్రీ వి. కె. సౌరిరాజఅయ్యంగార్ వందనము లర్పించారు.

## చైనా నడిగడ్డపై దాడికి ముహూర్తం

### దగ్గర పడుతున్నదని చాంగ్‌కైషేక్ ప్రకటన

తైపే, ఫార్మోజా, ఫిబ్రవరి 28: "మా విముక్తి దాడి ముహూర్తం దగ్గర పడుతున్నది, కమ్యూనిస్టు ప్రతిఘటన సన్నాహంలా. రష్యా ప్రతిఘటన సన్నాహాలు సంబంధించినంతవరకూ వచ్చే మూన సంవత్సరం చాలా ముఖ్యమైనది" అని జనరల్ చాంగ్‌కైషేక్ ఇవాళ ఇక్కడ ఉద్ఘాటించాడు. తన అధ్యక్ష పదవి స్వీకరించి తృతీయ వార్షికోత్సవ సందర్భంలో గావించిన ఒక ప్రకటన యందు ఆయనీ సంగతి వెల్లడించాడు.

## బర్మారోడ్డువద్ద సైనిక స్థావరం ఏర్పాటుకు చాంగ్ సేనలయత్నం

మేమ్యో (బర్మా) ఫిబ్రవరి 28: కమ్యూనిస్టు చైనాలోని యూనాన్ రాష్ట్రానికి వెళ్లే యుద్ధకాలపు బర్మారోడ్డు వెంబడి అంతా ఒక స్థిరమైన సైనిక స్థావరాన్ని నెలకొల్పుటకు బర్మా ఈశాన్య సరిహద్దులోని చైనా జాతీయువాదులు పర్వ తశ్రేణిలా ప్రయత్నిస్తున్నట్లు సరిహద్దు రక్షణ స్థానరాలను కాస్తున్న బర్మా అధికారులు నేడు రాయిటర్ విలేఖరితో చెప్పారు.

## పర్షియారాజు విదేశపర్యటన సంకల్ప విరమణ

### రాజభవనంవద్ద ప్రజాసమూహాల ప్రతికూల ప్రదర్శన ఫలితంగా మనస్సు మార్పు

టెహరాన్, ఫిబ్రవరి 28: 'నాకు జబ్బుగా వున్నది. విదేశాల్లో చికిత్స పొందడానికి దేశంనుంచి వెళ్లిపోతున్నాను' అని నేడు పర్షియా రాజు (షా) మొదట ప్రకటించారు. కాని షా వెళ్లిపోగూడదని కేకలువేస్తూ జనసమూహం రాజప్రాసాదంవద్ద మూగడంవల్ల 'షా' తనమనస్సు మార్చుకుని, 'నేను వెళ్లను' అని ప్రకటించారు.

షా ప్రజలయెదుటికి రాకుండా తన భవనంలోనే వుండి దూర ప్రసారణ యంత్రంద్వారా ఉద్రిక్తంవల్ల వొణుకుతున్న కంఠంతో ఇలా అన్నారు: జబ్బు నయంచేసుకోవడానికి విదేశాలకు వెళ్ళాల్సిందని నేనుగూడా డాక్టరులు సలహాయిచ్చారు. ఇంతేగాక యాత్ర కూడా చేసుకో గోరుతున్నాను. కాని నన్నందరూ వీరుఅడ్డు పెట్టుతూ వుండడంవల్ల నా ప్రయాణాన్ని వాయిదా వేసుకొన నిశ్చయించాను' అని రాజాగారు అన్నారు.

జనసమూహం హర్షనినాదాలు చేశారు. 'షా' వెళ్లిపోవడం మాకు యిష్టంలేదు ... కేకలు వేశారు.

క్రితం జరిగిన అనేక పరిణామాల అనంతరం రాజాగారు తన ప్రజలతో మాట్లాడారు. పార్లమెంటు దిగువసభ అధ్యక్షునికి ఆయన మొదట ఒక పత్రిక ద్వారా దేశాన్ని వదలిపోవాలనుకున్న ఉద్దేశ్యం ప్రకటించారు. వెళ్లిపోవడానికి కారణమేమిటో ఆయన తెలుపలేదు. శనివారంనాడు పార్లమెంటు సాధారణంగా సమావేశం కాదు. అయినప్పటికి ఈ ప్రశ్నను గూర్చి విచారించడానికి పార్లమెంటు ప్రత్యేకంగా సమావేశమైంది. సమావేశ పార్లమెంటు ప్రతినిధులు రాజాగారిని చూడడానికి వెళ్ళారు. మీరు తిరిగివచ్చిన తరువాత పార్లమెంటు రహస్య సమావేశం జరిగింది.

రాజాగారి ప్రత్యుత్తరం ప్రకటింపగా స్పష్టంగా ప్రకటించినందువల్ల జనసమూహమును ప్రజలలో మూగారు. అనేక నాదాలు గూడా తిరుగ ఆరంభించాయి. 'షా' దేశంనుంచి వెళ్లకూడదు' అని అంటూ కేకలు వేశారు.

### ప్రధాని భవనంవద్ద మొదటి కాల్పులు

రాజభవనానికి దగ్గరలో పుండ్పు ...

(3 వ పేజీ చూడుడు)

## మలయాలో మరణదండన విధించిన చైనా బాలిక సమస్య

### ఆమెకు ప్రాణభిక్షపెడితే తాము శిక్షించినబ్రిటిష్ వర్తకునితప్పగిస్తామనిబ్రిటన్‌కుహాంగరేసూచన

లండన్, ఫిబ్రవరి 28: మలయాలో మరణదండన విధించిన 24 ఏండ్ల చైనా బాలిక లీ మెంగ్‌కు ప్రాణభిక్ష పెట్టినట్లయితే హాంగరీ జైలులో 48 ఏండ్ల బ్రిటిష్ వ్యాపారస్థుడైన ఎడ్గార్ సాండర్స్‌ను విడిచిపెడతామని హాంగరీయన్ ప్రభుత్వం బ్రిటిష్ ప్రభుత్వానికి సూచించారు.

బుడాపెస్టులోని బ్రిటిష్ రాయబారివద్దనెకి ఈ సూచన చేశారు. బ్రిటిష్ విదేశాంగ మంత్రి ఆంథోనీ ఈడెన్ అమెరికాకు బయలుదేరి వెళ్లేముందు బ్రిటిష్ మంత్రివర్గంవారు ఈ సూచనను పరిశీలించారని తెలుస్తున్నది.

ఎడ్గార్ సాండర్సు మూడేండ్ల క్రిందట హాంగరీ జైల్లోకు. గూఢచారిగా పనిచేశాడనే ఆరోపణపైనా, విధ్వంసక కార్యాలు చేశాడనే ఆరోపణపైనా బుడాపెస్టుకోర్టు ఆతనికి 13 ఏండ్ల శిక్షవిధించింది.

లీమెంగును గత సంవత్సరం జూలై 24 మలయాలో అరెస్టుచేశారు. చేతిబాంబును అక్రమంగా తనవద్ద వుంచుకొన్నాడనే ఆరోపణపై ఆమెకు మరణదండన విధించారు. లీమెంగుపై దాక్షిణ్యం చూపాలని కోరుతూ 60 మంది పార్లమెంటు సభ్యులు పిటిషన్ నుల్లా ...

(3 వ పేజీ చూడుడు)

## హైద్రాబాదు అసెంబ్లీలో ఫ్రంట్ వాకౌట్

హైదరాబాదు, మార్చి 1: సంస్థాన శాసనసభలోని పీపిల్సు డెమోక్రటిక్ సభ్యులు 40 మంది రేపు శాసనసభలో రాజప్రముఖ్ నిజాం ఉపన్యసించ బోవగానే వాకౌట్ చేయుటకు నిశ్చయించారు. రాజప్రముఖుల పద్ధతికి నిరసన తెల్పడమే ఈ 'వాకౌట్' ఉద్దేశ్యమని పార్టీ నాయకుడు వి. డి. దేశపాండేగారు చెప్పారు.

## విదేశాలతో అమెరికా ఒప్పందాలు

### పరిమితం చేయాలని రిపబ్లికన్ ప్రభుత్వ కృషి

వాషింగ్టన్, ఫిబ్రవరి 28. ఇతరదేశాలతో అమెరికా చేసుకునే అంతర్జాతీయ ఒప్పందాల పరిమితులను తగ్గించాలని రిపబ్లికన్ ప్రభుత్వం చేసుకున్న నిశ్చయాన్ననుసరించి ప్రెసిడెంటు ఐసెన్‌హోవర్ ఆజ్ఞానుసారం 40 మంది ప్రభుత్వ న్యాయవ్యవహార సలహాదారులు అటువంటి ఒప్పందాల పరిశీలనలు జరుపుతున్నారు.

విదేశీ ఒప్పందాలకు ఉండే పరిమితులను తగ్గించటానికి రెండు ప్రతిపాదనలు చేయబడెను. కాంగ్రెసు ఆమోదం పొందితేకాని విదేశీ ఒప్పందం అమలుకాకూడదన్న ప్రతిపాదన మొదటిది. ఒకఅధ్యక్షుడు చేసిన ఒప్పందాలను ఆతనితరువాతి అధ్యక్షుడు పదవిలోకివచ్చిన 6 నెలలలోపుగా ధృవపరచకపోతే అవిరద్దు కావలెనని జేనన్నది రెండవ ప్రతిపాదన.

మూడు ఈ సదస్సు ... న్యాయశాఖ ... అనీ ఒప్పందాలు ... విదేశాంగమంత్రి డల్లెస్ ఒక ప్రకటనచేస్తారు.

(యు. పి. ఐ. ఫ్రాన్స్‌ప్రెస్)

## ఆరామవన కృషికి కొత్తడిగ్రీలు

### మద్రాసు అకడమిక్ కౌన్సిలు నిర్ణయం

మదరాసు, ఫిబ్రవరి 28: ఆరామవన కృషిలో తర్ఫీదు పొందే వారికి, సంఘ సంక్షేమ కార్యములందు ఆరితేరిన వారికి మదరాసు యూనివర్సిటీ పట్టములొసగవలెనని నిన్న సెనేట్ హాలులో సమావేశమైన యూనివర్సిటీ అకాడమిక్ కౌన్సిలువారు సిఫార్సు చేశారు.

వైస్ ఛాన్సలరు డా॥ ఏ. లక్ష్మణస్వామి మొదలియారుగారు అధ్యక్షత వహించారు. ఆరామవన కృషి శిక్షణకు పట్టము యివ్వాలని శ్రీ తోతాద్రి అయ్యంగారు ప్రతిపాదించారు. ఎట్టి చర్చలేకుండా యీ ప్రతిపాదనను కౌన్సిలు ఆమోదించింది.

### సాంఘిక సేవకులు

తర్ఫీదుపొందిన సాంఘిక సేవకులు చాలా కావలసియున్నందున అట్టివారికి కూడా పట్టములు యివ్వడం అవసరమని బొంబై, ఢిల్లీ, పాట్నా, పూనా, బెనారస్, మద్రాసులలో ఇదివరకే కొన్ని పాఠశాలలు పనిచేస్తున్నాయని రెవరెండ్ మర్ఫీగారు తీర్మానము ప్రతిపాదిస్తూ చెప్పారు. ఈ సూచన కూడా అంగీకరింపబడింది.

## తెలుగులో హాస్యరసం

తిరుపతి, ఫిబ్రవరి 28: నుంగాపురం ప్రభుత్వ ట్రయినింగు పాఠశాలలో 25వ తేదీన ఆంధ్రసారస్వత సంఘం అధ్వర్యాన సభ జరిగినది. ప్రధానోపాధ్యాయులు శ్రీచిల్లరవరం గురునాథంగారుఅధ్యక్షతవహించారు. విద్వాన్ శ్రీ ఆకొండి వెంకటశాస్త్రిగారు ఆంధ్ర సారస్వతంలో హాస్యరస సంస్థానం గురించి ప్రసంగిస్తూ చిలకమర్తి, కందుకూరి, పానుగంటి, ప్రభృతుల రచనలు కొన్ని చదివి వినిపించారు. శ్రీ బి. వీరభద్రయ్యగారి వందనములతో సభముగిసినది.

## లక్నో ఉపాధ్యాయుల నిరశన దీక్ష

లక్నో, ఫిబ్రవరి 28: ఈ వారప్రారంభమున నిరశనదీక్ష ప్రారంభించిన నలుగురు ఉపాధ్యాయులను నేటి అర్ధరాత్రి సమయమున పోలీసులు స్థానిక ఆసుపత్రికి చేర్చారు.

వీరు ఆరురోజులనుంచి ప్రాయోపవేశం చేస్తున్నారు. వీరిలో 60 ఏండ్ల స్త్రీకూడా వున్నది.

## బళ్ళారికాలేజి వార్షికోత్సవం

### పలుప్రదర్శనలు

బళ్లారి, ఫిబ్రవరి 27: స్థానిక వీరశైవ కళాశాల వార్షికోత్సవములు రెండు దినములు జయప్రదముగా జరిగినవి. పాండూరు యువరాజాగారు అధ్యక్షత వహించారు. మొదటిరోజు న్యాయవాది యల్. మృత్యుంజయశాస్త్రిగా రుపన్యసిస్తూ, భాషారాష్ట్ర విర్మాణము ప్రస్తుతము పనికిరాదన్నారు. పాండూరు యువరాజాగారు, తమ కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయపు విద్యార్థి అనుభవములను సుచ్చరించుతూ, అక్కడ విద్యార్థుల మానసిక పుటలవాట్లను పెంపొందింతురు కాని, కేవలం పాఠాలు వప్పచెప్పే పద్ధతికి ప్రాధాన్య మివ్వరన్నారు. ఆటపోటీలలో నెగ్గిన వారికి యువరాజాగారు బహుమతులను పంచిరి. బసవరాజుగారు, ప్రిన్సిపాలు రామానందరావుగారు మాట్లాడిరి. చౌ చౌ ప్రదర్శనముతో ఉత్సవము ముగిసెను.

### పారిశ్రామిక, కళా, వ్యవసాయ ప్రదర్శనం

గత 12 దినములుగా ఇక్కడ జరిగిన పారిశ్రామిక, కళా వ్యవసాయక ప్రదర్శనం గురువారం రాత్రి ముగిసెను. కలెక్టరు డి. ఆర్. సుందరంగారధ్యక్షత వహించారు. శ్రీమతి సుందరం పతిగారు ప్రదర్శకులకు బహుమతులను పంచిరి. పాటల ప్రదర్శనమునకు, శ్రీకాకుళం కలెక్టరైన యస్. భగవాన్‌దాసుగారికి బహుమతి వచ్చెను.

కార్యదర్శి, బళ్లారి డిప్యూటీకలెక్టరైన చంద్రమౌళి రెడ్డిగారు నివేదికలో ప్రభుత్వంవారు రూ. 1500 విరాళ మిచ్చిరని తెలిపిరి. సహాయ కార్యదర్శి నే. సూర్యారావుగారు కృతజ్ఞతాభివందనాలతో సభ ముగిసింది. స్వ. వి.

## చంద్రగిరి హైస్కూలు వార్షికోత్సవం

### బాలికల విద్యాభివృద్ధికి కృషి చెయ్యాలని ఉద్బోధ

తిరుపతి, ఫిబ్రవరి 28: చంద్రగిరి బోర్డు హైస్కూలు వార్షికోత్సవం నిన్న జరిగింది. మద్రాసు శాసనసభా కౌన్సిలు సభ్యులు ఆర్. వాసుమునిరెడ్డిగారు సమావేశానికి అధ్యక్షత వహించారు. హైస్కూలు సహోపాధ్యాయుడు ఎమ్. పద్మనాభ రెడ్డిగారు సభికులకు స్వాగతం చెబుతూ స్కూలు అభివృద్ధికి సహాయపడవలసిందిగా హైస్కూలు పూర్వ విద్యార్థులకు, చంద్రగిరి పౌరులకు విజ్ఞప్తి చేశారు.

ప్రధానోపాధ్యాయుడు ఆర్. వి. వెంకట్రమణరావుగారు వార్షిక నివేదిక సమర్పించుతూ గత సంవత్సరం యీ స్కూల్లోంచి స్కూలు ఫైనలు పరీక్షలకు హాజరయిన 58 మంది విద్యార్థులలో 44 మంది కృతార్థులయినారని వివరించారు. ఆర్థిక పరిస్థితులు సరిగ్గా లేకపోవడంవల్ల, సమీప గ్రామాలలో క్రొత్తగా స్కూళ్ళు నెలకొల్పడంవల్ల ఈ యేడు స్కూలు విద్యార్థుల సంఖ్య కొంచెం తగ్గిందన్నారు. స్కూలు భవనానికి విరాళాలిచ్చిన దాతలకు కృతజ్ఞత తెలుపుతూ, మరి కొన్ని కొత్తభవనాలు కట్టవలసి వున్నది. గనుక ఇతోధికంగా విరాళాలివ్వమని ప్రజలకు విజ్ఞప్తిచేశారు.

పరీక్షలలో మంచి మార్కులు తెచ్చుకున్న విద్యార్థులకు ఆటలలో గెలుపొందినవారికి శాసనసభ్యుడు కె. ఆదికేశవులు నాయుడుగారు బహుమతులు పంచిపెట్టారు. ఆసందర్భంలో క్లుప్తంగా ప్రసంగిస్తూ ఆటలలోను, పరీక్షలలోను ఆ వేకమంది విద్యార్థినులు కూడా పాల్గొనడం తనకు సంతోషంగా వున్నదనీ, ఈవిధంగా దేశంలోని బాలికలు చాలాకాలం క్రిందటనే విద్యారంగంలో ముందుకువచ్చి వున్నట్లయితే దేశపరిస్థితులు ఏనాడో బాగుపడి వుండేవని ఆదికేశవులు నాయుడుగారన్నారు.

ప్రజలు ఈవిషయం గమనించి తమ బాలురతోపాటు బాలికలకు కూడా విద్యచెప్పించి మంచి పౌరులుగా తయారుచెయ్యాలని కూడా ఆయన ఉద్బోధించారు.

ఈఅవకాశం తనకు కలిగించినందుకు పాలకవర్గంవారికి వాసుమునిరెడ్డిగారు తను అధ్యక్షోపన్యాసంలో కృతజ్ఞత తెలిపారు. చంద్రగిరి పట్టణాభివృద్ధికి తగుచర్యలు తీసుకోవాలంటూ, ఫస్టుగ్రేడు ట్రెయినింగు స్కూలుకొక మంచిభవనం ఇవ్వాలనీ ప్రజలకొఱకు విజ్ఞప్తి చేశారు. చంద్రగిరిలో తగుభవనము లేదనే కారణంతో ఆస్కూలును అక్కడినుంచి తరలించే విషయం ప్రభుత్వ పరిశీలనలో వున్నదనికూడా శ్రీ రెడ్డిగారు ప్రజలకు చెప్పారు. ఈ స్కూలు అభివృద్ధికి కృషి చేస్తానని శ్రీ రెడ్డి వాగ్దానం చేశారు. శ్రీ కె. వి. నరసింహాచారిగారు కృతజ్ఞతాభివందనలు సమర్పించారు. పాఠశాల విద్యార్థులు నాటిక ప్రదర్శించడంతో సమావేశం సమాప్తమయింది.

(స్వ. వి.)

## రాయలసీమ యువజన సంఘం

బెంగుళూరు, ఫిబ్రవరి 26: శ్రీబాగ్ ఒడంబడిక ననుసరించి ఆంధ్రరాష్ట్రంలో రాయలసీమ అభివృద్ధికి ప్రత్యేక శ్రద్ధవహించాలనీ, ఆంధ్రరాష్ట్రమునకు తాత్కాలికరాజధాని మద్రాసులో నే యేర్పాటు చేయాల్యలనీ, డిటెన్షన్ విధానాన్ని వెంటనే రద్దుచెయ్యాలనీ, తిరుపతి కేంద్రముగా రాయలసీమకు ప్రత్యేక విశ్వవిద్యాలయం ఏర్పాటు చెయ్యాలనీ, బి. పర్వతిరెడ్డిగారి అధ్యక్షతన రాయలసీమ యువకులు ఈనెల 22వ తేదీన సమావేశమై తీర్మానించారు. శ్రీయుతులు ఆర్. కృష్ణారెడ్డి, బి. ఎస్. విరూపాక్షయ్య, బి. పర్వతిరెడ్డి, కృష్ణమనాయుడు. ఎన్. ఎన్. హనుమంతారెడ్డి, కె. ఆర్. నారాయణరెడ్డి, ఆర్. కృష్ణమూర్తి, సి. చాయపతి. ఎస్. శివశంకరరెడ్డి గారలతో కొత్తకార్యవర్గం ఏర్పాటు చేశారు.

## అ. భా. మహిళల వార్షిక సమావేశం వాయిదా

మధుర, మార్చి 1: మార్చి 7వ తేదీ నుండి ఇక్కడ ప్రారంభం కావలసిన అఖిల భారత మహిళాసంఘ తమిళనాడు శాఖ వార్షిక సమావేశం మార్చి 14వ తేదీకి వాయిదా పడింది.

## ఫార్వర్డ్‌బ్లాక్ పార్టీ

### ఎన్నికల కమిషనరు వైఖరి

రాజమండ్రి, ఫిబ్రవరి 28: అఖిల భారత ఫార్వర్డుబ్లాకు పార్టీని దేశంలోని పెద్ద పార్టీలలో ఒకటిగా ఎన్నికల కమీషనరు గుర్తించనందుకు ఆయన వైఖరిని విమర్శించుచూ ఆంధ్ర ఫార్వర్డు బ్లాక్ పార్టీ చైర్మన్ పి. సూర్యప్రకాశరావు ప్రధాన కార్యదర్శి వి. యల్. సుందరరావుగారలు ఇటీవల ఒక ప్రకటన చేశారు.

ఫార్వర్డుబ్లాక్ పార్టీ దేశానికి చేసిన సేవను ఎన్నికల కమిషనరు గుర్తించలేదనీ, పార్లమెంటరీ సంప్రదాయాలనాయన ఈవిషయంలో సరిగ్గా గమనించలేదనీ, ఎన్నికల కమిషనరు తన నిర్ణయాన్ని పునః పరిశీలించాలనీ ఆ ప్రకటనలో వున్నది.

## వ్యవసాయకూలీల కనీస వేతనాలు

### హెచ్చించాలని ప్రభుత్వానికి అభ్యర్థన

విజయవాడ, ఫిబ్రవరి 28: మదరాసు ప్రభుత్వంవారు నిర్ణయించిన వ్యవసాయకూలీల కనీస వేతనాలు కూలీలకు సంవత్సరం పొడుగునా రక్షణ యివ్వలేవనీ, కనుక సగటున కుటుంబానికి 5 గురు వంతుల దృష్టిలో వుంచుకొని, మట్టిపని, కుప్పనూర్పిడి పనులకు రో 1 కి రు 3లు న్నూ, నాట్లు, కోత కలుపు, పనులకు రు 2లున్నూ, నిర్ణయించాలనీ, సంవత్సరమునకు 15 రోజులు సాధారణ సెలవయున్నూ, సెలవి నములు అస్వస్థతగానున్న రోజులలో వినియోగించుకు నేందుకున్నూ, యివ్వాలనీ, రొంపేరు భూములు హరిజనులకు పేదలకు-యిప్పించాలనీ రాష్ట్ర మంతటా నీరా వుత్పత్తికి అనుమతించాలనీ ప్రభుత్వాన్నభ్యర్థిస్తూ యిటీవల ఆంధ్రదేశ వ్యవసాయ కూలీ కాంగ్రెసువారు తీర్మానించారు. రొంపేరు భూముల విషయమై ప్రభుత్వంతో రాయబారాలు జరపటానికి 9 మంది సభ్యులతో ఒక సంఘం నియమించారు.

## డా॥ యు. కృష్ణారావు గారి ప్రసంగం

### గీతపనివారల నాయకుల విమర్శ

ఏలూరు, ఫిబ్రవరి 28: "మద్రాసు పరిశ్రమల శాఖామాత్యులు శ్రీ యు. కృష్ణారావుగారు మధురలో ప్రసంగిస్తూ దొంగసారా తయారు విరివిగా సాగుచున్నదని అన్నారు. ప్రభుత్వం సక్రమంగా చట్టాన్ని అమలుజరుపుటలేదనికూడా వారి ప్రసంగంవల్ల తెలుస్తున్నది. ఇది పరస్పర విరుద్ధంగా వున్నది. పైగా యిప్పట్లో చట్టం రద్దుచేస్తే యిదివరకు వచ్చినంత ఆదాయం రాకపోవచ్చునికూడా మంత్రిగారన్నారు. నిరుద్యోగులుగానున్న లక్షలకొలది మాజీ గీతపనివారల కష్టనిష్ఠూరాలు తెలుసుకుకొందుకు స్వయముగా కృషిచేయవలసిందని మంత్రిగారిని కోరుతున్నాము" అని శ్రీ కమ్ముల నాణేశ్వరరావు సంబూరి శ్రీనివాసరావుగార్లు ప్రకటిస్తున్నారు.

## అనవసరమైన ఆందోళన చేయవద్దు

### తమిళ సోదరులకు విజ్ఞప్తి

వెంకటగిరి ఫిబ్రవరి 27: వెంకటగిరి టవున్ ప్రజాపరిషత్తు కన్వీనరు డి. కె. వెంకటసుబ్బయ్యగారిలా ప్రకటిస్తున్నారు.

ఆంధ్రులు తమక స్థార్జిత మయిన మద్రాసు విషయములో కూడా ఎంతో ఒర్పు వహనము వహించి కేంద్ర ప్రభుత్వపు మధ్యవర్తిత్వమునకు కట్టుబడి వున్నంతకాలం తమిళుల మధ్యవర్తిత్వమునకు ధిక్కరించి మితిమీరి ఆందోళన సాగించడంవల్ల ఆంధ్రులకు ఆంధ్రరాష్ట్రము రాకుండా చేయవలయుననే ఉద్దేశ్యమువారికివున్నట్లుకన్పిస్తుంది. లోగడ వె. ప్రకాశంగారు థార్ కమిటీ సలహాలను త్రోసిపుచ్చినటు యిప్పుడుకూడా తమిళులను వాకు గాతీసుకొని న్యాయమూర్తి వాంఛూ గారి సలహాలను త్రోసిపుచ్చుతారేమోనని భయపడవలసిన పనిలేదు.")

## నందికొండ ప్రాజెక్టు మహాసభ

### జమాఖర్చుల వివరాలు

జగ్గయ్యపేట, ఫిబ్రవరి 25: ఈనెల 16వ తేదీన ఇక్కడ జరిగినవందికొండ ప్రాజెక్టు మహాసభా జమాఖర్చులను గురించి సభకు మహాసభ ప్రధానకార్యదర్శి జి. నాగేశ్వర రావుగారొక ప్రకటన చేస్తున్నారు. ఈ మహాసభకు మొత్తం రు. 3061-11-0 లు. వసూలయిందనీ, మొత్తం రూ. 2842-9-1 లు ఖర్చయిందనీ, ఖర్చులుపోను మిగతా రూ. 219-2-11 లు తనవద్ద నిలువ వున్నదనీ నాగేశ్వర రావుగారు ఆ ప్రకటనలో వివరిస్తున్నారు.

## తూర్పుగోదావరి జిల్లా పశు ప్రదర్శనం

కొత్తపేట, ఫిబ్రవరి 26: ఈ నెల 23, 24 తేదీలలో జరిగిన తూర్పుగోదావరిజిల్లా పశుప్రదర్శనంలో ఇవ్వబడిన బహుమతులలో కొన్ని అన్యాయాలు జరిగినవంటూ వర్తిసాయి సర్వసారాయణమూర్తిగారొక ప్రకటన చేస్తున్నారు.

## 'రామన్ ఎఫెక్ట్' రజతోత్సవం

### భౌతిక శాస్త్రవేత్తల సభలో అభినందనలు

మదరాసు, ఫిబ్రవరి 28: శాస్త్రజ్ఞులు భౌతికశాస్త్రజ్ఞులు, రసాయనికశాస్త్రజ్ఞులు "రామన్ ప్రయోగం" రజతోత్సవము సందర్భమున నోబెల్ బహుమాన పరిగ్రహీత శ్రీ సి. వి. రామన్‌ను ప్రశంసించారు. "రామన్ ప్రయోగం" కనిపెట్టబడి 1928 మార్చి 16 తేదీన వెల్లడించబడింది.

ఫిజికల్ సైన్సు సంఘంవారు ప్రెసిడెన్సీ కాలేజ ఇంగ్లీషుహాల్లో ఏర్పాటు చేసిన సభకు శ్రీ టి. ఎస్. శేషాద్రి అధ్యక్షత వహించారు.

"రామన్ ప్రయోగంవల్ల మనకు పదార్థములు భౌతికభావమును తెలుసుకొనుటకు వీలుకలిగింది. శ్రీ రామన్ సత్యాన్వేషి" అని శ్రీ శేషాద్రి అన్నారు.

డాక్టర్ బి. ఎస్. శ్రీకంఠన్ శ్రీ సి. వి. రామన్. డా॥ లక్ష్మణ మొదలియార్, సి. పి. రామస్వామి అయ్యర్ డా॥ ఎస్. భగవంతం, డా॥ సి. ఎస్. వెంకటేశ్వరన్, డా॥ శేషాద్రిగార్లు పంపిన శుభ సందేశములను చదివి వినిపించారు.

డా॥ యం. ఎ. గోవిందరావు, శ్రీ జి. ఎన్. రామచంద్రన్, ఎస్. వి. అనంతకృష్ణన్, కె. ఎన్. మీనన్ రె. ఫాదర్ ఎద్దనపల్లి, యం. రామనాథన్, డా॥ విజయరాఘవన్ డా॥ డి. పరశింగరావు శ్రీ సి. వి. రామన్ ప్రతిభను గురించి ప్రసంగించారు.

శ్రీ సి. వి. రామన్‌కు దీర్ఘ ఆయురారోగ్య ఐశ్వర్యములు కలుగచేయాలని భగవంతుని ప్రార్థిస్తూ ఒకతీర్మానం చేయబడింది. డా॥ శ్రీకంఠన్ వందనము లర్పించారు.

## భారత దేశంలో వైద్య సహాయం

### 6300 మందికి ఒక వైద్యుడు

న్యూయార్క్, మార్చి 1: 1950 లో ఇండియాలో సగటున 6300 మంది ప్రజలకు ఒక్క వైద్యుడు ఉన్నట్లు ఐక్యరాజ్య సమితి డైరెక్టరీ తెలియజేస్తున్నది. ఇది నిన్న ప్రచురించబడ్డది.

అదే సం॥లో ఇథియోపియాలో లక్షయాభై వేల మందికి ఒక్క వైద్యుడు చొప్పున, 700 మందికి ఒక్క వైద్యుడు చొప్పున స్విట్జర్లండ్ లోను ఉన్నారు.

ఫిలింపరిశ్రమలో ఇండియా హాలీవుడ్ తరవాతవస్తుందని ఆ ప్రచురణ తెలుపుతున్నది. 1948కు తరవాత అమెరికా ఏడాదికి 400కు లోపు చిత్రాల చొప్పున తయారు చేస్తుండగా, ఇండియా 1947 లో 280 ఫిల్ములను తయారు చేసింది. అయితే జపాన్, మెక్సికోలలో కూడా ఈ పరిశ్రమ చాలా అభివృద్ధి పొందుతున్నది.

1951 లో పాకిస్థాన్ లో వెయ్యి మంది ప్రజలు 2 పత్రికల చొ॥ చదువుతారు. బ్రిటన్‌లో వెయ్యి మంది 612 పత్రికల్ని చదువుతారు. ఆఫ్ఘనిస్థాన్‌లో వెయ్యిమంది ప్రజలు ఒక్క పత్రిక చొప్పున చదువుతారు.

## జంతువుల మనస్తత్వ పరిశీలన

### ఐదుగురు పశ్చిమ జర్మనీ శాస్త్రజ్ఞుల రాక

బొంబాయి, ఫిబ్రవరి 28: ఐదుగురు పశ్చిమ జర్మన్ జంతు శాస్త్రజ్ఞులు, మున్‌స్టర్ జాతీయ యితిహాస చిత్రవస్తు ప్రదర్శనశాల డైరెక్టరు ప్రొ॥ బేరమ్ హార్డు-రెన్ష్ నాయకత్వమున లండన్ నుంచి నేడు యిక్కడికి వచ్చారు.

ఏనుగులకు స్వభావ సిద్ధంగా తెలివితేటలు వున్నాయా? లేక శిక్షణవల్ల ఏనుగులు తెలివి గలవవుతున్నాయా? అనే విషయమును కనుగొనడానికి నేను మచ్చిక అయి పనులుచేస్తున్న ఏనుగుల, అడవి ఏనుగుల యితర జంతువుల మెదడును పరీక్షిస్తాను' అని రెన్ష్ అన్నారు.

హిమాలయ ప్రాంతంలోను, మధ్య భారతంలోను, దక్షిణ భారతం లోనూ వీరు 3 మాసాలు పర్యటిస్తారు. భారతదేశమువందలి వివిధ జంతువుల రక్తమును, మెదడును వీరు పరీక్షిస్తారు.

అంగిక పరిణామం విషయమై వచ్చే మాసం ఢిల్లీలో జరిగే ఒక సమావేశానికి ప్రొ॥ రెన్ష్ సహాయకత్వంవహిస్తారు. ఈసభ జాతీయ వైజ్ఞానిక సంస్థ అధ్వర్యాన జరుగుతుంది.

## మార్చి 5 న "జమ్మూ-కాశ్మీర్" దినం

### జనసంఘ, మహాసభ, పరిషత్తుల నిర్ణయం

న్యూఢిల్లీ, ఫిబ్రవరి 28: మార్చి 5వ తేదీన 'జమ్మూ-కాశ్మీర్' దినం జరపాలని జనసంఘం, హిందూమహాసభ, రామరాజ్య పరిషత్‌ల సంయుక్త సంఘం నేడు నిశ్చయించింది. ఈసంఘంలో డా॥ ఖరే, డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీ, ఎన్. సి. చటర్జీ ప్రభృతులు ఉన్నారు.

వారుయుక్తంగా ఒక ప్రకటన చేస్తూ ప్రజాస్వామ్యంలో శాంతియుత ప్రతిఘటనను అణచివేయటంవల్లగాని పరిస్థితుల్ని కించపరచటం సాధ్యం కాదని హెచ్చరించారు.

## 54 పటాలాలు: 19 శతఘ్ని దళాలు

### వియత్‌నామ్ సైనిక బల నిర్మాణం

లండన్, ఫిబ్రవరి 28: వియత్‌నామ్ ప్రభుత్వంవారు యుద్ధానికి సన్నద్ధంగావుండే 54 పటాలాలసేనను మూడు రిజర్వుదళాలను, 19 శతఘ్ని దళాలను యేర్పరుస్తున్నారని వియత్‌నామ్ రాయబార కార్యాలయంవారు నేడు యిక్కడ ప్రకటించారు. ఈ మూడు దళాల్లోను మొత్తం 40 వేల మంది సైనికులు వుంటారు.

ఫ్రాంకో-వియత్‌నామ్ సైనిక మిషన్ ఫిబ్రవరి ప్రారంభమున డాలట్‌లో (వియత్‌నామ్) ఈ కార్యక్రమమును అంగీకరించారని రాయబార కార్యాలయంవారు ప్రకటించారు.

## రన్‌జీట్రోఫీ ఫైనల్స్‌కు బెంగాల్

కలకత్తా, మార్చి 1: ఈవేళ బెంగాల్ జట్టు రన్‌జీట్రోఫీ క్రికెట్ సెమి ఫైనల్సులో మైసూరును 104 పరుగుల తేడాతో ఓడించి ఫైనల్సులో ప్రవేశించింది. ఈవేళ మైసూరు రెండవ ఇన్నింగ్సులో 166 పరుగులకే అవుటయిపోయింది. మొదటి ఇన్నింగ్సు బెంగాల్ 368, మైసూరు 198, రెండవ ఇన్నింగ్సు బెంగాల్ 110.

## అ. భా. టెక్స్‌టైల్ మహాసభ

కోయంబత్తూర్, ఫిబ్రవరి 28: పదవ అఖిలభారత టెక్స్‌టైల్ మహాసభ నేడిక్కడ సి. ఎస్. రత్నసభాపతి మొదలియార్ అధ్యక్షతన ప్రారంభమయింది. నోబెల్ బహుమతిపొందిన శాస్త్రవేత్త డా॥ సి. వి. రామన్ ప్రారంభోత్సవం చేశారు. ఆర్థికమంత్రి సుబ్రమణ్యంగారు వస్తుప్రదర్శనను ప్రారంభించారు.

దేశంలో వస్త్రనూలు నేతపరిశ్రమ భవిష్యత్తును గురించి ఇది చర్చిస్తుంది.

## మధుర అగ్నిప్రమాదంలో 6 గురి మృతి

మధుర, మార్చి 1: నిన్న సాయంత్రం యిక్కడికి 8 మైళ్ల దూరంలో వున్న చింతామణి అనేచోట టపాకాయలు పేలి 6 గురు తీవ్రంగా గాయపడ్డారు. వెంటనే ఆస్పత్రిలో చేర్చబడ్డారుకాని, రాత్రి వారందరూ మరణించారు. అందులో ముగ్గురు పన్నెండేళ్లవాళ్లు, ఒకడు 14 ఏళ్లవాడు, మరొకడు 16 ఏళ్ళవాడు ఆరవ వ్యక్తి వయస్సు 35.

## గ్రామపంచాయతీ ఎన్నికలను గురించి ఒకవిజ్ఞప్తి

కళ్యాణదుర్గం, ఫిబ్రవరి 28: అనంతపురంజిల్లా కళ్యాణదుర్గం తాలూకాలో త్వరలో జరుగనున్న గ్రామపంచాయతీ ఎన్నికలలో ప్రజలు తమవిభేదాలు విస్మరించి సమైక్యంగా వ్యవహరించి సక్రమమైన పద్ధతిలో నిజాయితీగల వారినిమాత్రమే ప్రతినిధులుగా ఎన్నుకోవాలని విజ్ఞప్తిచేస్తూ కె. వెంకటసుబ్బారావుగారు ఇటీవల ఒకప్రకటన చేశారు.

## బ్రిటన్ లొంగిపోతున్నట్లు యార్క్ ఆర్చిబిషప్ విమర్శ

లండన్, ఫిబ్రవరి 28: ఫార్మోజా చైనా దిగ్బంధనలపై అమెరికన్ నాయకులు ఇటీవల చేస్తున్న ప్రకటనలు బ్రిటన్‌లో చాలా ఆందోళన కలిగిస్తున్నవని యార్క్ ఆర్చిబిషప్ డా॥ సిరిల్ గార్బెట్ నిన్న రాత్రి ప్రకటించారు.

చైనాతో యుద్ధానికి దారితీసేచర్యలన్నిటినీ బ్రిటన్ పూర్తిగా ప్రతిఘటిస్తుందని అమెరికాకు స్పష్టం చేయవలసిన అవసరం ఉన్నదని ఆయన ఉద్ఘాటించారు. (యు. పి. ఐ. ప్రాన్స్ ప్రెస్)

కైరో, ఫిబ్రవరి 28: కొద్ది రోజుల్లోనే ఈజిప్టు, తూర్పు జర్మనీలు వాణిజ్య ఒప్పందం చేసుకోబోతున్నవని ఈజిప్టు ప్రభుత్వోద్యోగి ఒకరు నేడు ప్రకటించారు. ఉభయ దేశాల ప్రతినిధులు నేడు ఒప్పందము పాయిదాను ఆమోదించారు. ఏ సమయంలోనూ ఎగుమతి దిగుమతుల తేడా 512 వేల పౌన్లకు మించరాదని వీరు నిర్ణయించుకున్నారు.

## ఉరిశిక్ష విధింపబడిన చైనా బాలిక

(1 వ పేజీ తరువాయి)

నకు విజ్ఞప్తిచేశారు.

ఇట్టి మాదిరి తమకు చేరినట్లు బ్రిటిష్ వైదేశిక కార్యాలయంవారు నేడు ధ్రువపరిచారు. కమ్యూనిస్టులు చేసిన ఈ మాదిరిని బ్రిటిష్ ప్రభుత్వం నిరాకరించడం నిశ్చయమని తెలుస్తున్నది.

ఇది యిలావుండగా తన భర్తను విడుదల చేయడానికి చేతనైనదంతా చేయాల్సిందని ఎడ్వర్ పాండర్స్ భార్య ప్రధాని చర్చిలుకు తంతివార్త పంపింది. ఈ కేసు ముగ్గురు కుమార్తెలు. 1950 సం॥ జనవరిలో తనభర్తను పనికి పూర్వం ఆమె తనభర్తను చూచింది.

## పర్షియా వ్యవహారాలు

(1 వ పేజీ తరువాయి)

ప్రధాని మొసాదిక్ భవనాన్ని జనసమూహం చుట్టుముట్టారు రాజుకు అనుకూలురైయున పార్లమెంటు దిగువ సభ స్పీకరు కొషానీ అనుచరులు ఒక జీపులోవచ్చి ప్రధానిభవనం వద్ద కాపలా కాస్తున్న పోలీసు మిలిటరీ శ్రేణిని ఛేధించుకొనిపోయారు. ముఖ్య ద్వారం పడిపోయింది. పోలీసులు తుపాకులు కాల్పగా ముగ్గురు గాయపడ్డారు.

రాజుగారి భవనం చుట్టూ కూడా ప్రజలు మూగారు. ప్రజలు రాజుగారి యింటివైపుకు వెళ్లకుండా పోలీసులు అడ్డగించారు.

పోలీసులు వీధులలో గస్తీ తిరిగారు. ప్రజలు వీధులలో ఊరేగింపులు చేశారు.

## రెండవసారి కాల్పులలో ఒకని మరణము

రాజుగారిని క్షమాపణ వేడాలని కేకలు వేస్తూ జనసమూహము ప్రధాని మసాదిక్ భవనం యెదుట ప్రదర్శనాలు చేశారు. సైనికులు మర్లాతుపాకులు కాల్చారు. ఒకడు మరణించాడు. ఉభయపక్షాలకు జరిగిన సంఘర్షణలో ఒక కర్నల్‌తో సహా 14 గురికి గాయాలు తగిలాయి.

### కర్ఫ్యూ ఉత్తరువు

జనసమూహం యింకా వీధులలో తిరుగుతూ వుండడంవల్ల కర్ఫ్యూను విధించేశామని, అర్ధరాత్రి నుంచి గాక రాత్రి 11 గంటలనుంచేకర్ఫ్యూ అమలులోనికి వస్తుందని టెహరాన్ రేడియో ప్రకటించింది.

రాజుగారి ఆస్తివిషయంలోపర్షియా ప్రభుత్వానికీ రాజుకు విభేదాలు యేర్పడినవని, ఈ వార ప్రారంభమున ప్రధాని మసాదిక్ నాలుగంటలసేపు రాజుగారితో మాట్లాడారని పౌరులకు తెలిసేవున్నది. "రాజుగారికి దేశవ్యవహారాల్లో తిరిగి ప్రాముఖ్యత కలుగుతుందని ఈ విషయాలు స్పష్టం చేస్తున్నవి" అని రాజకీయ పరిశీలకులు అంటున్నారు. కాని రాజకీయ పర్యవసానాలు యెలా వుంటాయో యింకా స్పష్టంగా తెలియడం లేదు.

# రాయలసీమక్షామంవిపమిస్తున్నది

## సత్వర సహాయానికి ప్రముఖుల విజ్ఞప్తి

చిత్తూరు, ఫిబ్రవరి 27: గత సంవత్సరంకంటేకూడా ఈయేడు రాయలసీమలో క్షామం తీవ్రతరమగుతున్నదనీ, ముఖ్యంగా చిత్తూరులో త్రాగడానికికూడా మంచినీళ్లు దొరకడం లేదంటూ ఆర్. వెంకటరెడ్డిగారొక ప్రకటన చేస్తున్నారు. ఆ ప్రకటన వివరాలివి:

"క్షామముచే పీడింపబడుచుండే రాయలసీమజిల్లాల పరిస్థితి విషమించుతున్నది. గడచిన వర్షాకాలంను చిట్టచివర అసాధారణముగా పడిన యీ స్వల్పవర్షమువల్లనో కరువుపరిస్థితులు కొంత తొలగుపడునను ఆశ నిరాశయైనది. సకాలములో వానలు లేక యేలాటి పైరులు లేనిసమయములో వర్షముపడగా రైతులు ఆతురతతో పెట్టిన పైరులు కూడా నీరుచాలక 100 కి 90 పాళ్లు యెండిపోయినవి. ఈ పంటలేరువాతి ఆహారధాన్యపునరలు తిస్గనసుప్రాహాలు కూడా నిరాధారములైనవి.

"ఇకముందు ధరలు ఇంకా పెరుగును సూచనలు లేకపోలేదు. ఇప్పటికే యీ మారుమూలలలోనేతప్ప యెచ్చట చూచినా బావులుయెండి మంచినీళ్లు కూడా దొరకడం లేదు. వచ్చునది వేసవికాలము. తిండికి, నీటికి మనుష్యులే గాక పశువులుకూడా చాలా బాధపడవలసి వస్తుందని ప్రజలు భయభ్రాంతులగుతున్నారు.

"చిత్తూరుజిల్లాపరిస్థితులు విషాదకరముగాయున్నవి. ఇప్పటికే చిత్తూరు పట్టణములో సహా నీటివసతులు లేవు. మెట్టతాలూకాలైన పలమనేరు, పుంగనూరు, మదనపల్లె, వాయల్పాడు తాలూకా రైతుల జీవనాధారమనదగు ఇదివరకే దరాసులు అమ్ముకున్నారు. వ్యవసాయమునకు మూలాధారములగు పశువులనుసహా అమ్ముకొని తింటున్నారు. ఈ ప్రాంతములో పశువుల సంతలసంఖ్య పెరిగి వారములో రోజూ వేనవేలు పశువులను అమ్ముతుండగా మందలు మందలుగా జిల్లాకు ఈశాన్యమున, ఆగ్నేయపు జిల్లాలకు తోలుకొనిపోవుట చిత్తూరు పురవీధులలోను యితర రోడ్లలోను చూచుటకు అతి శోచనీయముగా వున్నది. అట్టి రైతుల ముందుగతియేమి?

"ఈ తాలూకాలుపైకి నిస్సారమైన పుంగనూరుతాలూకాను కరువుప్రాంతముగా మదనపల్లి, వాయల్పాడుతాలూకాలతో చేర్చకపోవడము జిల్లా రెవిన్యూఅధికారుల పొరపాటని తలంచుచున్నాను.

"ఈ తాలూకాలలోకూడా యీ సంవత్సరము ముఖ్య ఆహారపంటలైన రాగి, జొన్న, వరిన్ని వర్షకపంటలు కూడా పూర్తిగా పోయినవి."

## బకాయిలు, శిస్తులు వాయిదా వెయ్యాలి

తాలూకా క్షామబాధిత సహాయ సంఘం కార్యదర్శి శ్రీ డి. సత్యం ఇలా ప్రకటిస్తున్నారు: "ఈ తాలూకా ప్రజలు గడచిన 6 సం॥ భీకరమైన క్షామానికిగురియై, కృంగి, కృశించి పోవుచున్న ఈ తరుణంలో స్థానిక జమీందార్లువారికి చెల్లించవలసిన శిస్తు బకాయిలను, 1357 వ ఫసలీనుంచి 1361 ఫసలీవరకు ప్రభుత్వమువారు రైతులవద్దనుంచి వసూలుచేస్తున్నారు. ఈ శిస్తువసూళ్లవల్లా ఈ తాలూకా ప్రజలు, మరీమరీ స్థానిక గ్రామోద్యోగస్థులచే అవమానింపబడటమును, అవమానమును సహించలేక శిస్తులు చెల్లించలేక, శిస్తుచెల్లించే తాహతులేక చాలా మంది రైతులు, గ్రామాలువదలి, ఇతర గ్రామాలకు వెళ్లిపోవడం, పగలంతా యితరవూర్లలో వుండి, రాత్రి కృమాత్రం వూర్లో వాళ్ళింటికి వెళ్లడం జరుగుతున్నది.

"తిండిగింజలులేకపస్తులుపడుతున్న ఈ తాలూకారైతులు, ప్రభుత్వానికి చెల్లించవలసినశిస్తే, చెల్లించలేని రైతులు యిప్పుడీవిధముగా 5 సం॥ శిస్తు ఎట్లు చెల్లించగలరో అర్థంకావున్నది. కొనుగోలుశక్తిలేక జీవనమే దుర్భరమైపోయిన ఈతాలూకారైతులరక్షణార్థమై, ప్రభుత్వమే జీవనభృతి రుణాలు, తక్కావి అప్పులుయిచ్చి, గంజికేంద్రాలు పెట్టించి, సహాయకార్యక్రమాలను అమలుజరిపిన ఇప్పుడు జరుగుతున్న ప్రభుత్వమే జమీందారులకు చెల్లించవలసిన శిస్తు, నిర్దాక్షిణ్యంగా వసూలుచేయ బూనుకోవడం చాలా విచారకరముగానున్నది. గాన, ప్రభుత్వంవారు, ఈ తాలూకా తహసీల్దారుకు తక్షణం శిస్తువసూళ్లు నిలుపుదలచేస్తూ, తగు ఉత్తర్వులు తొందరగా పంపాలనీ, ఈ తాలూకా క్షామప్రాంతము చే విషయాన్ని విస్మరించక ఈ సం॥ ప్రభుత్వానికి చెల్లించవలసిన శిస్తు రెమిషను యిప్పించాలని కోరుతున్నాను."

## జీవితాన్నిసరిదిద్ద గలిగిన విద్యా వశ్యకత

మద్రాసు మార్చి 1: మద్రాసు సాంఘిక సాంస్కృతిక సంఘంలో మద్రాసు విశ్వవిద్యాలయంలో దార్శనిక శాస్త్రంలో పరిశోధక పండితురాలుగా ఉన్న శ్రీమతి సరస్వతి చెన్నకేశవన్ గారు ఆత్మవిద్యపు మనం ప్రాధాన్యం ఇవ్వాలన్నారు. అది జీవితాన్ని సరిదిద్ద గలదన్నారు. దార్శనిక శాస్త్రి గారు సభాధ్యక్షత వహించారు. కె. వి. కృష్ణశర్మగారి వందనాలతో సభముగిసింది.

# ప్రపంచ ఆరోగ్య నిపుణులు

## కార్పొరేషన్ స్వాగతం

మదరాసు, మార్చి 1: ప్రపంచ ఆరోగ్యసంస్థకు సంబంధించిన వైద్య నిపుణులను సన్మానించుటకు నిన్న సాయంత్రం రిప్పన్ భవనంలో పౌర సన్మానం ఏర్పాటు చేయబడింది.

అల్పాహారానంతరం మేయరు శ్రీ టి. చెంగల్వరాయన్ గారు కార్పొరేషను తరఫున వైద్య నిపుణులకు స్వాగతం మొసగారు. వైద్య నిపుణులు వైద్యశాస్త్రంగురించి ఒసగిన ఉపన్యాసాలు విద్యార్థులను పరవసులను తేనిసరనే సంగతి తమకు తెలిసిందని అన్నారు. కార్పొరేషనువారు ప్రజారోగ్యాన్నిరక్షించటానికి జరుపుతున్న పనులను వివరించి ఆరోగ్య విహార్ అంతర్జాతీయ ఖ్యాతిని పొందియున్నదని అన్నారు.

వైద్య నిపుణులజట్టు నాయకుడు డా॥ సామ్యూల్ జడ్ లెపైన్ గారు కార్పొరేషనువారికి మేయరుకు వారొసగిన సన్మానమునకు కృతజ్ఞతను తెలిపారు.

డా॥ రిగ్లర్ గారు మదరాసుపౌరులు తమయెడల చూపిన ఆదరాభిమానాలకు ధన్యవాదాలు తెలియజేశారు.

## ఎన్నికలలో పోటీ చేసిన ప్రభుత్వోద్యోగి

### నిబంధనలచట్టం వర్తింపు

### ప్రభుత్వ వివరణ

తిరుపతి, మార్చి 1: ప్రభుత్వ కార్యాలయంలో పనిచేసే ఒక పుద్యోగి గడచిన జనరల్ ఎన్నికలలో మదరాసు అసెంబ్లీకి అభ్యర్థిగా పోటీ చేశాడని ప్రభుత్వానికి తెలియవచ్చినది. అతని తరపున మరో రిగురు ప్రచారం చేశారట. ప్రభుత్వంవారు విచారించి బహుశా ప్రభుత్వోద్యోగుల నిబంధనల చట్టం నుజ్ దూర్ తరగతికి చెందిన వారికి వర్తించదనీ పొరబాటు అభిప్రాయంలో వారా విధంగా చేసివుంటారనీ, యికముందు అలాంటి విషయాల్లో జోక్యం కలుగజేసుకోరాదనీ, ఆ నిబంధనలు ఆ తరగతి వుద్యోగులకు కూడా వర్తిస్తాయనీ తెలియజేశారట.

## ఖూనీకేసు సందర్భంలో దంపతుల అరెస్టు

చెరుకుపల్లి ఫిబ్రవరి 26: పెదపల్లిలో జరిగిన ఖూనీ సందర్భంలో గాయపడిన దేవరకొండ సుబ్రహ్మణ్యం తెనాలి ఆస్పత్రిలో 25 న మరణించాడు. కత్తి మొదలైన పరికరాలు అందిచ్చారనే నేరంపై దేవరకొండ నీలమేఘం అతని భార్యను అరెస్టుచేసి రేపల్లె సబ్ జైలుకు పంపారు.

# టికెట్టు లేని ప్రయాణీకులు

## సుమారు 179 రూ॥ల అపరాధ రుసుం వసూలు

విజయవాడ, ఫిబ్రవరి 28: నిన్న రాత్రి విజయవాడ రైల్వే స్టేషనులో పూరీ ప్యాసెంజరు ఢిల్లీ ఎక్స్‌ప్రెస్, పార్సెలు ప్యాసింజరు, మద్రాసు మెయిలు బండ్లలో టిక్కట్టు లేకుండా ప్రయాణం చేస్తున్న 150 మందిని రైల్వే అధికారులు, పోలీసులుపట్టుకున్నారు.

వీరిలో 74 మందినుంచి రూ. 178-15-0 అదనపు ఛార్జీగా వసూలు చేశారు. అపరాధ రుసుము చెల్లించని 35 మందిని రైల్వే మేజస్ట్రేటు కోర్టులో విచారణకు పంపించారు. మిగతా 41 మందిని అనుమానమైన కారణముల క్రింద రిమాండులో వుంచారు. యీ సందర్భంలో నాల్గు సైకిలు ట్యూబులలో దాచబడిన దొంగసారాయికూడ పట్టుబడింది. ఇద్దరిని అరెస్టుచేశారు.

ఈ ఆకస్మిక దాడిలో విజయవాడ రైల్వే డి. టి. యస్. సైనాటర్సు రైల్వే డిప్యూటీ పోలీసు సూపరింటెండెంటు శ్రీ డి. సుబ్బారావు, పోలీసు ఇనస్పెక్టరు శ్రీ పి. శేషాచలయ్య, తదితర రైల్వే, రైల్వే పోలీసు అధికారులు పాల్గొని విశేష కృషి చేశారు.

ఇటువంటి ఆకస్మిక పరిశోధన టిక్కట్టు లేకుండా ప్రయాణం చేసే వారిని పట్టుకొనుటకు, రైల్వేల ఆదాయం వృద్ధిచేయుటకు తోడ్పడగలదని భావించబడుతున్నది. (స్వ. వి.)

## పశ్చిమకృష్ణా ప్రజాసోషలిస్టు పార్టీ

### కార్యవర్గ సమావేశం మార్చి 4 న

విజయవాడ, ఫిబ్రవరి 28: పశ్చిమ కృష్ణా ప్రజాసోషలిస్టుపార్టీ కార్యకర్తల సమావేశం మార్చి 4 వ తేదీన ఇక్కడ పట్టణ ప్రజాసోషలిస్టుపార్టీ కార్యాలయంలో ఆంధ్ర ప్రజాసోషలిస్టు పార్టీ కార్యవర్గ సభ్యులు డా॥ టి. వి. ఎస్. చలపతిరావు గారి అధ్యక్షతన జరుగుతుందని విజయవాడ పట్టణ ప్రజాసోషలిస్టుపార్టీ కార్యదర్శి శ్రీ జి. వి. ఎల్. నరసింహారావు, పాతూరి వెంకటేశ్వరరావు గారలు ప్రకటిస్తున్నారు.

# ప్రపంచ సమస్యల పరిష్కారానికి కృషి

## దివ్యజ్ఞానసమాజ పాత్ర: గవర్నరు అభిభాషణ

మద్రాసు, ఫిబ్రవరి 28: దివ్యజ్ఞాన సమాజ నూతన అధ్యక్షులు శ్రీరాం గారి అభినందనసభలో మద్రాసు గవర్నరు శ్రీ ప్రకాశ గారు మాట్లాడుతూ ప్రపంచ సమస్యలను పరిష్కరించడానికి దివ్యజ్ఞాన సమాజం ఎంతో తోడ్పడగలదన్నారు. ఎన్. శ్రీరాం గారి గౌరవార్థం త్యాగరాయనగరం బజుల్లారోడ్డు 44 నెం. గృహంలో అల్పాహారవిందు ఏర్పాటు చేయబడింది.

ప్రొ. ఆర్ శ్రీనివాసన్ గారు స్వాగతమిచ్చారు. 30 వేలు సభ్యులు కలిగి 50 దేశాలు పాల్గొంటున్న సంస్థకు భారతీయుడు అధ్యక్షులుగా ఎన్నుకోనబడటం ప్రశంసనీయమని గవర్నరు శ్రీ ప్రకాశ గారు అన్నారు. పాశ్చాత్యుల వేశభాషలేదప్ప వారిలో మంచిని నేర్చుకోవడం తప్పకవగా ఉన్నదనీ, ప్రాచ్యదేశాల, పాశ్చాత్యదేశాల అవర్గాల మేళనవల్లయే వసులు బాగుపడవలెనని అన్నారు. లౌకిక రాజ్యదర్శానికి, దివ్యజ్ఞాన సమాజ ఆదర్శానికి సన్నిహితత్వం ఉన్నదని గవర్నరు గారు అన్నారు.

కాశీ దివ్యజ్ఞాన పాఠశాల పక్షాన నాజ్ డిసాల్ గారు, సమాజ ఉపాధ్యక్షులు పిడ్జన్ వక్ గారలు శ్రీరాం గారికి అభినందనలు తెలిపారు.

శ్రీరాం గారు సమాధానమిస్తూ సత్యాన్వేషణ తత్పరత దివ్యజ్ఞాన సమాజలక్ష్యమనీ, బ్రహ్మవిద్యావిషయే దివ్యజ్ఞాన సమాజము నెఅధునాతన నామాన్ని దాల్చిందని అన్నారు. మానవ శ్రేయస్సుకు, ప్రపంచ క్షేమానికి మనుష్యుని దృక్పథంలో మార్పురావాలనీ, అందరియెడ సహకార సద్భావాలు పెంపొందాలనీ అన్నారు.

## మద్రాసు కార్పొరేషన్ బడ్జెట్ సమావేశం

మదరాసు కార్పొరేషను బడ్జెటు ప్రవేశపెట్టి చర్చించేనిమిత్తం కార్పొరేషను సభ యీ క్రింది కార్యక్రమమునసరించి జరుపబడుతుంది. మార్చి 4 సా 5-15 గం. సాధారణ సభ. బడ్జెటు ప్రతిపాదన: దానిపై చర్చ మార్చి 5, 6 వ తేదీలలో సా 5-15 గం వాయిదా. సభ బడ్జెటుచర్చ-మార్చి 17 సా 5-15 డిమాండులపై ఓటింగ్. బడ్జెటు ఆమోదము.

## భారత వాణిజ్య ఫెడరేషన్ వార్షికసభ

మదరాసు, ఫిబ్రవరి 28: భారత వాణిజ్య ఫెడరేషను 26 వ వార్షికసభ న్యూఢిల్లీలో హోటల్ ఇంపీరియల్ యందు మార్చి, 7, 8. తేదీలలో జరుగుతుంది. భారతప్రధాని పండిత జవహర్‌లాల్ నెహ్రూగారు సమావేశ ప్రారంభోత్సవం జరుపుతారు. పైసభ ఆంధ్రవాణిజ్యసంఘంతరఫున ప్రతినిధులు శ్రీయుతులు పి. సూర్యనారాయణ, బి. డి. వి. రామస్వామి, జి ఎ. మంకె. ఆర్య పి. శ్రీనివాసరావు గార్లు నామినేటుచేయబడియున్నారు. సంఘ కార్యదర్శి శ్రీ వి. యస్. రావు గారుకూడా ప్రతినిధులతో వెళ్తారు.

అంతర్జాతీయ వాణిజ్యసంస్థ భారత జాతీయకమిటీ 24 వ. వార్షికసభ న్యూఢిల్లీలో మార్చి 7 వ తేదీ జరుగుతుంది. ఈసభకు ఆంధ్ర వాణిజ్యసంఘంవారు తమ అధ్యక్షులు శ్రీ పి. సూర్యనారాయణగారిని ప్రతినిధిగా నామినేటు చేసియున్నారు.

## కొత్త హిందీ తరగతులు

ప్రాథమికనుండి ప్రవీణ వరకు అన్ని తరగతులు దక్షిణ భారత హిందీ ప్రచార సభకు చెందిన పలు శిల్పా స్థలాల్లో కొత్తగా మార్చి 2 వ తేదీ నుండి జరుపబడగలవు. ఇతర వివరాలు మదరాసు సెకెండ్ లైన్ బీచి నెం 18/14 సందుగల నగర కార్యాలయంనుండి బడయవచ్చు.

క్రీడారంగం:

# ఉత్తరభారత టెన్నిస్‌లో నరేంద్రనాథ్‌కు మరొకవిజయం

## హైద్రాబాద్ సెమిఫైనల్సుకు బాబ్జీ: ప్రపంచ సైకిల్‌పోటీకి భారతజట్టు

ఢిల్లీ, ఫిబ్రవరి 28: కొత్తడిల్లీ ఉత్తరభారత టెన్నిస్ ఛాంపియన్‌షిప్ పోటీలలో ఇండియా నంబర్ వన్ నరేంద్రనాథ్, నరేశ్ కుమార్‌తో కలిసి డబుల్సు ఫైనల్సులో విజయాన్ని సాధించారు. గెలవగల్గునని భావించబడ్డ పాక్ ఛాంపియన్ ఇఫ్తికార్ అహ్మద్, ఆస్ట్రేలియా ప్రతినిధి హ్యూ బర్ లను గట్టిపోటీమీద ఓడించారు. (2-6, 6-3, 6-2, 5-7, 6-2.)

5 సెట్లవరకూ సాగిన ఈ పోటీలో నలుగురూ ఎంతో గొప్ప నైపుణ్యాన్ని, పట్టుదలనూ చూపించారు. నరేంద్రనాథ్ సర్వీస్, నరేశ్‌కుమార్ డ్రైవులు, హ్యూబర్ లిఫ్టులు, ఇఫ్తికార్ క్రాస్ కోర్టు షాట్లు అద్భుతంగా ఉన్నవి.

నరేంద్రనాథ్, నరేశ్‌కుమార్ లు నిన్న సింగిల్స్ సెమిఫైనల్సులో ఇఫ్తికార్, హ్యూబర్ లను ఓడించారు.

స్త్రీల డబుల్స్ సెమిఫైనల్సులో మిస్ పి. షేక్, మిసెస్ రోడ్రిగేజ్ లు మిసెస్ దలీప్ సింగ్, మిస్ వాసుదేవలను నిన్న ఓడించారు. ఈ పోటీ పూర్తికావటానికి 3 సెట్లలోనూ 64 గేములు ఆడవలసి వచ్చింది. రెండవ సెమిఫైనల్సులో మిసెస్ జకరియా సెన్ మిసెస్ లీలారయాల్ లు గెలిచారు. మిక్స్‌డ్ డబుల్స్ఫైనల్సులో మిస్ షేక్ ఎ. హ్యూబర్ లు మిసెస్ రోడ్రిగెజ్, సహానీలను ఓడించారు.

బెంగాల్ 2 వ యిన్నింగ్సులో శివాజీ రోస్ ఒక్క పరుగుకూడ చేయకుండా అవుటయినాడు. మైసూరు బౌలర్ సాలియా 29 పరుగులకు 5 వికెట్లనూ, కృష్ణా 22 పరుగులకు 3 వికెట్లనూ తీసుకున్నారు.

అహమదాబాద్‌లో నేటినుంచీ జరుగుతున్న రనజీ ట్రోఫీ సెమీ ఫైనల్సులో గుజరాత్ మొదటి ఇన్నింగ్సులో 202 పరుగులు చేసింది. ఆట ముగింపుకు మహారాష్ట్ర మొదటి ఇన్నింగ్సులో 3 వికెట్లకు 56 పరుగులు చేసింది.

ఆనారోగ్యంవల్ల ఇండియాకు పంపబడుతున్నట్లు నిశ్చయమయిన మాకౌ, గైక్వాడ్ లు వెస్టిండీస్ ఆటల్లో పాల్గొనే అనుమతిలభించింది.

## జూనియర్సులో అసిఫ్ కాదరీ విజయం

జూనియర్సు సింగిల్సు ఫైనల్సులో హైదరాబాద్ ప్రతినిధి అసిఫ్ కాదరీ విజయాన్ని సాధించాడు. అతను ప్రేంకిశోర్‌ను 2 సెట్లలో ఓడించాడు. (9-7, 9-7).

## హైదరాబాద్ టెన్నిస్ సెమి ఫైనల్సుకు బాబ్జీ

హైదరాబాద్, ఫిబ్రవరి 27: ఈ వేళ ఇక్కడ హైదరాబాదు హార్డ్‌కోర్ట్ టెన్నిస్ పోటీలలో భారత హార్డ్‌కోర్ట్ టెన్నిస్ డబుల్స్ విజేత ఎం. వి. బాబ్జీ సింగిల్స్ సెమిఫైనల్సుకు వచ్చాడు. అతడు క్వార్టర్ ఫైనల్సులో అఫ్సర్ లతీఫ్‌ను ఓడించాడు (6-1, 6-2). మరొక క్వార్టర్ ఫైనల్సుపోటీలో బకీర్ అఫ్సర్‌ను ఓడించాడు. బాబ్జీ విష్ణుమోహన్‌తో కలిసి బొంబాయిలో నరేంద్రనాథ్, వసంతులను ఓడించినసంగతి పాఠకులకు విదితమే.

డబుల్సు క్వార్టర్ ఫైనల్సులో ఫర్ఖుందా అలీఖాన్, అతని సహచరుడు కలిసి మెహరా అండ్ పార్ట్‌నర్‌ను ఓడించారు (7-5, 6-4). జూనియర్సు సింగిల్సు క్వార్టర్ ఫైనల్సులో అబ్బాస్ శేఖియల్‌ను ఓడించాడు (6-3, 9-7).

## మద్రాసు పోటీలు

మద్రాసు, ఫిబ్రవరి 28: నేటి సాయంత్రం ఎస్. ఐ. ఎ. ఎ. గ్రవుండ్సులో జరిగిన మద్రాసురాష్ట్ర హార్డ్‌కోర్ట్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్ పోటీలలో ఎ. జె. ఉదయకుమార్, ఎం. ఎస్. అప్పారావునూ; ఆర్. నరసింహన్, ఎస్. సుందరరాజన్‌నూ, సి. రామచంద్రరావు, ఎస్. ఎం. సుందరాన్ని ఓడించారు.

## ప్రపంచ సైకిల్‌పోటీలకు ఇండియా జట్టు

బొంబాయి, ఫిబ్రవరి 27: ఆగస్టు మూడోవారంలో జూరిచ్‌లో జరిగే ప్రపంచ సైకిల్ పోటీలకు ఈ క్రింది వారిని భారత జట్టుగా నియమిస్తూ భారత సైకిల్స ఫెడరేషన్ నేడు ప్రకటించింది. మదన్ మోహన్ (ఢిల్లీ) జెర్రీ విల్సన్ (బొంబాయి), అమర్‌జిత్ సింగ్ (బొంబాయి), షేక్ బషీర్ (మహారాష్ట్ర), టి. కె. సేట్ (బెం), డగ్లస్ ఫ్రాంజీ (బెం), ఎం. రాము (మై.)

తమఖర్చులు తాము భరించే పద్ధతిలో హైదరాబాద్ ప్రతినిధి హబీబ్ సలీం, మద్రాసు ప్రతినిధి జి. సి. పల్లానో, డి. భాపుశే (మహారా), వి. ఫ్రాంజీ (బెం)లు వెళ్ళవచ్చును.

ఫిబ్రవరి 15 వ ఇక్కడ జరిగిన భారత సైకిల్ పోటీలలో వెయ్యి మీటర్ల, 4 వేల మీటర్ల పందేలలో మదన్ మోహన్, వెయ్యిమీటర్ల స్ప్రింటులో జెర్రీవిల్సన్, 110 మైళ్ల రోడ్డు పందెంలో షేక్ బషీర్ గెలిచినసంగతి పాఠకులకు జ్ఞాపకం వుంటుంది. హబీబ్ సలీం డిసెంబరు20వ హైదరాబాద్‌లో జరిగిన 400 మైళ్ళ పోటీలో పాల్గొన్నాడు. పల్లానో మద్రాసు ఒలింపిక్ పోటీలలో పాల్గొన్నాడు!

## రనజీట్రోఫీ క్రికెట్

కలకత్తా, ఫిబ్రవరి 28: నిన్నటి నుంచీ యిక్కడ జరుగుతున్న రనజీ ట్రోఫీ క్రికెట్ సెమి ఫైనల్సులో బెంగాల్ జట్టు ఈ వేళ టీ వేళకు 23 నిమిషాలు తక్కువ 110 పరుగులకే అవుటయిపోయినది. ఆట ముగింపు వేళకు మైసూరు 2వ ఇన్నింగ్సులో 2 వికెట్ల నష్టానికి 61 పరుగులు సాధించింది.

# రేడియో

## మంగళవారం, మార్చి 3 వ తేదీ

### విజయవాడ

ఉ॥ 7 తెలుగున వా॥, 7-15 మదరాసు (బి) వలె, 7-30 మద్రాసువలె, 8 ఆంగ్లమున వా॥.

మ॥ 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు, 1 మద్రాసు (ఎ) వలె, 1-40 హిందీలో వా॥, 1-50 తెలుగున వా॥, 2 మద్రాసు (బి) వలె, 2-15 ఉన్నతపాఠశాలా విద్యార్థులకు, సాహిత్యపురోగమన సాధనలు: నవల (ప్రసంగం), కె. కుటుంబరావు, జానపద సంగీతమునకు ప్రక్కవాద్య లక్షణములు (ప్రసంగం), కవికొండల వెంకటరావు, 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు.

సా॥ 5-30 శకుంతలా అనందరావు (గాత్రం), 5-50 శిష్టు బ్రహ్మయ్యశాస్త్రి, వయొలిన్, 6-10 స్థానిక ప్రకటనలు, వాతావరణం, 6-15 సంగీత శిక్షణ, 6-30 గ్రామస్థుల కార్యక్రమం చిన్నా పెద్దా (కథ), వి. యస్. అవధాని, 7-30 గీతమంజరి, ఎం. సావిత్రి పి. నాగేశ్వర రావు, 7-45 వాద్య బృందం, 8 శకుంతలా అనందరావు, శిష్టు బ్రహ్మయ్యశాస్త్రి, వయొలిన్, 9 ఆంగ్లమున వా॥, 9-15 విశ్వవిద్యాలయ కార్యక్రమం (ఆంగ్లం).

### మద్రాసు (ఎ)

ఉ॥ 7 స్వాగతం, 7-15 తమిళమున వార్తలు, 7-30ఎల్. కృష్ణన్ (గాత్రం) 8 ఆంగ్లమున వార్తలు.

మ॥ 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు (తమిళం), 1 మహిళామండలి, 1-30 గీతమంజరి (రి) 1-40 హిందీలో వార్తలు 1-50 గానమంజరి (రి) 2 తమిళమున వార్తలు, 2-10 మద్రాసు (బి) వలె, 2.15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు (తమిళం), 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు (తమిళం) 4-30 పాశ్చాత్య సంగీతం, సా॥ 5-30 అర్, యల్, కృష్ణమూర్తియార్ వయొలిన్, 8 ఆంగ్లమున వార్తలు. 8-5 స్థానిక ప్రకటనలు, వాతావరణం (ఆంగ్లం), 6-15 కె. వి. సుబ్రహ్మణ్యం, 7 పరిని జయలక్ష్మి, వేదాలం, 7-15 తమిళమున వార్తలు, 7-50 బొంబాయిదట్టం, సభ (తమిళ ప్రసంగం), 7-45 తిరుచ్చిపలె, 9 ఆంగ్లమున వార్తలు, 9-15 హిందీపాఠము 9-30 మద్రాసు (బి) వలె, 10 వాద్య సంగీతం (రి).

### మద్రాసు (బి)

ఉ॥ 7 తెలుగున వార్తలు, 7-15 ఉదయగానం (రి), 7-30 మద్రాసు (ఎ) వలె.

మ॥ 12 కార్మికుల కార్యక్రమం, 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు, 1 ఎస్. జి. కౌశల్యయ్యర్ (రి) 1-30 ఆంగ్లమున వార్తలు, 1-40 గీతమాలిక (రి), 1-50 తెలుగున వార్తలు 2 సారంగి నిలయ విద్వాంసుడు 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు (విజయవాడ వలె) 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు 4-30 మద్రాసు (ఎ) వలె.

సా॥ 5-30 మద్రాసు (ఎ) వలె 6-15 సాయంసంగీతం (రి) 6 30 గ్రామస్థుల కార్యక్రమం చిన్నా-పెద్దా (కథానిక) 7-30 పంచవర్ష ప్రణాళిక (ప్రసంగం) బి. గోపాలరెడ్డి 7-45 మద్రాసు(ఎ)వలె 9-15లకి తలిగిరందు (తమిళనాటిక) 9 30 జి. ఎస్. పందరీక 10 మద్రాసు (ఎ) వలె.

### హైదరాబాదు

ఉ॥ 7 తెలుగున వార్తలు 7-15 ఆర్. స్వామినాథన్ (గాత్రం) 8 ఆంగ్లమున వార్తలు 8-15 హిందీలో వా॥ 8-30 స్వయంపితి శ్రీనివాసన్ భజన్ 8-45 జాలేద్ లతీఫ్ సితార్ 9 డి. జగన్నాథరావ్ ఖయాల్.

మ॥ 12-30 గీత్ సంగ్రహ్ 12-50 మరాటీలో వా॥ 1 మాలిక్ కాఫుస్ రాజ్ (రి) 1-10 రాగధర (రి) 1-20 గేయ గుచ్ఛం (రి) 1-30 వాద్యకుచ (రి) 1-40 యుగళగానం (రి) 1-50 తెలుగున వార్తలు.

సా॥ 5-30 మరాటీలో కార్యక్రమం 6 జాలేద్ లతీఫ్ సితార్ 6-10 స్థానిక ప్రకటనలు 6-15 గ్రామసీమ బొబ్బిలియుద్ధం రచన వేదం వెంకట్రాయ శాస్త్రి కావ్యపఠనం గీతావళి ఎస్. నరసింహారావు 7 తెలుగున వా॥ 7-15 శ్రోతల ఉత్తరాలు 7-20 డి. జగన్నాథరావ్ ఖయాల్ 7-35 జాలేద్ లతీఫ్ సితార్ 7-45 కన్నడమున వా॥ 8 ఉర్దూలో వా॥ 8-15 డబ్బు సమావర్తం (ఆంగ్ల ప్రసంగం) ఉర్దూ హాలెండ్ 8-30 ఆర్కెస్ట్రా (రి) 9 ఆంగ్లమున వా॥ 9-15 మాసెయిగో డె (కన్నడనాటిక) 9.45 పి. సీతాలక్ష్మి కృష్ణమూర్తి వీణ.

## సామర్లకోటలో వరిసాగు పద్ధతుల ప్రదర్శనం

కాకినాడ, ఫిబ్రవరి 26: కృషి విస్తార్ మండలికి చెందిన సాడీ యా ప్రతినిధులు ఈనెల 24 తే సామర్లకోటలో జపాన్ వరిసాగులు ప్రదర్శించారు. వ్యవసాయ శాఖోద్యోగులు శ్రీ యమ్. సత్యనారాయణ ప్రభృతులు కూడా ఆ ప్రదర్శనలకు హాజరయినారు. జపాన్‌లో నారు మడి వేసే పద్ధతి, మొక్కలు నాటేపద్ధతి, కంపోస్టు ఎరువులు తయారుచేసే పద్ధతి మొదలయినవన్నీ వివరంగా ప్రదర్శించబడినవి. ఈ తీర జపానులో వరిసాగు పద్ధతులను తెలియచేసే చిత్రాలు కూడా ప్రదర్శించబడినవి. స్వ. వి.

# కడపజిల్లాలో నానాటికి విషమిస్తున్న క్షామపరిస్థితి

కడప, ఫిబ్రవరి 27: కడపజిల్లాలో సాగుకు పనికివచ్చే భూమి ఎంతవున్నా ప్రస్తుతం 11,33,906 ఎకరాలలో మాత్రమే వ్యవసాయం జరుగుతున్నది. జొన్న, ..., వేరుశెనగ, కొర్ర, సజ్జ, రాగి, ఉలవ, ప్రత్తి మొదలయిన పంటలు పండుతున్నవి. జొన్న 2,58,565 ఎకరాలలోను, వేరుశెనగ 2,36,924 ఎకరాలలోను, కొర్ర 1,04,439 ఎకరాలలోను పండించబడుతున్నవి.

మే నెలలోపడ్డ వానలు పొలాలు దున్న డానికి వినియోగపడినవి. కాని, రాయచోటి, రాజంపేట, బద్వేలు, సిద్ధవటంతాలూకాలలోని చెరువులలో ఒక్క చెరువులోకన్నా నీళ్లు ఎక్కలేదు. కుందులోమాత్రం వరదలు వచ్చినవి. సంవత్సరం మొత్తంమీద ఈ జిల్లాలో 24 అంగుళాలకన్నా వర్షం కురవలేదు. వర్షం మెట్టపంటలకు ఏ మాత్రం వినియోగపడలేదు. సకాలంలో వర్షాలు కురవనందువల్ల అన్నిరకాలపంటలు చెడిపోయినవి.

తినడానికి తిండిగింజలు దొరకడం లేదు. రైతులవద్దనున్న వగనాణ్యాగులన్నీ తాకట్టులపాలయినవి. ఇటువంటి పరిస్థితులలో పులివెందుల, రాయచోటి తాలూకాలలో కొన్ని ప్రాంతాలలోతప్ప మిగతా గంజికేంద్రాలను ప్రభుత్వం మూసివేయడం అన్యాయం. కమలాపురం, కడప, జమ్మలమడుగు మొదలయిన మెట్టతాలూకాలలోని ప్రజలు ఎంతచెప్పకున్నా వినకుండా ప్రభుత్వం శిస్తువసూలు చేస్తున్నట్లు తెలుస్తున్నది.

ఈ జిల్లాలో కరువు పరిస్థితులను ప్రభుత్వం తిరిగి పరిశీలించి, అవసరమైన ప్రాంతాలకు శిస్తురెమిషన్ ఇప్పించాలి. గండికోట ప్రాజెక్టు నిర్మాణం, కె. సి. కెనాలు మరమ్మత్తు మొదలయినవాటిని ప్రారంభించితే పేదవారికి పనులు లభిస్తవి. అవసరమైన మెట్టప్రాంతాలలో తిరిగి గంజికేంద్రాలు ప్రారంభించాలి. (స్వ. వి.)

## నేలనూతుల సుబ్బారాయుడు గారి మృతి

నెల్లూరు, ఫిబ్రవరి 26: స్థానిక ప్రముఖ న్యాయవాది నేలనూతుల సుబ్బారాయుడుగారు ఈ నెల 25 వ తేదీ రాత్రి వారి స్వగృహంలో 57 వ యేట మరణించారు. నెల్లూరు న్యాయవాదిసంఘ కార్యదర్శిగాను, ఆంధ్రసభ కార్యదర్శిగాను, రెంటుపేయర్సు అసోసియేషన్ కార్యదర్శిగారు, ఆంధ్రసభా కార్యవర్గ సభ్యుడుగాను అతి సమర్థతతో పనిచేశారు. ఆయనకిద్దరు కుమార్తెలు, అయిదుగురు కుమారులు కలరు. ఈ వేళ సాయంకాలం నెల్లూరు ఆంధ్రసభవారు అవసర సమావేశం జరిపి సుబ్బారాయుడు గారి మృతికి సంతాపం ప్రకటిస్తూ వారి కుటుంబానికి సానుభూతి తెలియచేస్తూ తీర్మానంచేశారు.

# సాహిత్యవేత్తలకు కళాకారులకు భారతప్రభుత్వసహాయం

తిరుపతి, ఫిబ్రవరి 28: దేశంలో సాహిత్యకళలను ప్రోత్సహించే నిమిత్తం, ఏటేట కొంతమంది కళాకారులకు సాహిత్యవేత్తలకు కొంత ఉపకారవేతనం ఇవ్వడానికి భారత ప్రభుత్వం నిశ్చయించింది.

సాహిత్యాది కళారంగాలలో ప్రత్యేక కృషి చేసి పేరెన్నికగన్నవారికి మాత్రమే యీ ప్రణాళిక ననుసరించి అవసర సమయాలలో ప్రభుత్వం ధన సహాయం చెయ్యగలదు. ఈ ప్రణాళిక ననుసరించి సహాయం పొందగోరువారు పెట్టుకోవలసిన దరఖాస్తులను కూడా భారత ప్రభుత్వం అచ్చువేయించింది. ఈ దరఖాస్తులను రాష్ట్ర ప్రభుత్వాలు గాని, లేక సాహిత్యాది సంస్థలుగాని లేక ఆయా విషయంలో విశేషానుభవంగల వ్యక్తులుగాని సిఫార్సు చేయవలసి వుంటుంది. భారత ప్రధాని, విద్యాశాఖమంత్రి, ఆర్థికమంత్రి సభ్యులుగావున్న సంఘంవారు ఆయా దరఖాస్తుదారుల యోగ్యతలను అర్హతలను నిర్ణయిస్తారు. (స్వ. వి.)

## డిటెన్షన్ విధానం రద్దుకు పురపాలక సంఘము తీర్మానం చెయ్యాలని విజ్ఞప్తి

భీమవరం, ఫిబ్రవరి 28: డిటెన్షన్ విధానానికి వ్యతిరేకంగా తీర్మానించిన భీమవరం పురపాలక సంఘంవారిని అభినందిస్తూ మిగతా స్థానిక సంస్థలుకూడా అవిధంగా తీర్మానించి ఆందోళన చేయాలని డెమొక్రాటిక్ విద్యార్థి యూనియన్ నాయకులు శ్రీ వి. ఆర్ తూమాటిగారు విజ్ఞప్తి చేస్తున్నారు.

రాణీపేట, ఫిబ్రవరి 28: మైసూరు మహారాజాకు పుత్రోదయమైన సందర్భంలో స్థానిక మహారాజా బీడీఫ్యాక్టరీయజమానులు జనాబ్ టి. యస్. అబ్దుల్ రహీం సాహెబ్ గారు పేదలకు మిఠాయి పంచిపెట్టారు. స్వ.వి.








